శ్రీరస్తు.

శ్రీ మే ధా ద క్షి ణా మూ ర్త యే న మః.

# పుష్పాచలఖండము.

ఈపురాణరత్నము

శ్రీమేధా దక్షిణామూర్తి వర ప్రసాదలబ్ధకవితా నైపథ్య

వేమనారాధ్యముగ్ధసంగేశ్వర పుత్రకౌండిన్య సగోత్రపవిత్ర

శివానుగ్రహానుషంగ

శ్రీకాళహస్తిలింగకవిశిఖామణిచే విరచింపంబడి,

శ్రీమద్రమారమణచరణ సరసీరుహనిస్సరన్మధురమకరంద

లహరీ నిరంతరపరిపూరితనిస్తరంగ నిజహృదయమహా

హ్రదవిమలీకృత స్వభావుడగు

కోపూరు పట్టాభిరామరావుచే బరిష్కరింపంబడి,

కడపపురవరముననుండు

క్రిష్ణంసూరయ్యశెట్టిగారి

కల్యాణ కుమార విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

వికృతిసంవత్సర చైత్రబహుళ ౧౨ లు.

మొదటికూర్పు ౧౨౦౦.

# విషయ సూచిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౪ | వహించె ... | ...నుదెలిపె. |
| | ౮ | వేడియని ... | ...వేడిమని. |
| | ౧౩ | ధర్మనిలిపె ... | ...ధర్మమూనె. |
| ౨ | ౧ | గేల్గ్రాలమర్ధించి .. | ...గేలన్విదారించి. |
| | ౫ | జీవనామృతంబు ... | ..జీవనాశయంబు. |
| | ౬ | లజ్ఞాన ... | ...మజ్ఞాన. |
| | ౬ | రోచు। ల। ... | ...రోచి । య. |
| | ౮ | దూద్భటా .. | ...డుద్భటా. |
| | ౧౧ | ద్వాణియు ... | ...ద్వాణిని. |
| | ౧౧ | వేదుకర్॥ ... | ..వేదెదర్॥. |
| | ౧౬ | నేతృనై ... | ...నేత్రులై. |
| | ౨౧ | తిలకంబనంగ। ... | ...తిలకంబనదగు. |
| | ౨౨ | కాణాచిగాగను ... | ...కాణాచిగల్గంగ. |
| ౩ | ౮ | దాంపత్యమ ... | ...దంపతుల. |
| | ౧౦ | మతుల ... | ...మతిని. |
| | ౧౯ | నేరికిన్॥ ... | ...యేరికిన్॥ |
| | ౨౪ | యవని ... | ...అవని. |
| | ౨౫ | బాంధవుడా ... | ...బాంధవుడో. |
| | ౨౭ | స్వప్రభు ... | ...సత్కవి. |
| ౪ | ౨ | దాల్పడే ... | ...తాల్పడే. |
| | ౫ | తృష్టి। ... | ...తుష్టి; |
| | ౫ | ప్రొద్దు ... | ..ప్రొద్దు. |
| | ౧౨ | ఘుర్లిననూన ... | ...ఘుర్లెయనూన. |
| | ౧౩ | కెద్దినిరర్థకంబను ... | ...కెద్దియువ్యర్థమౌనను. |
| | ౧౮ | యొప్పగు ... | ...ఒప్పగు. |
| | ౧౯ | ప్రెడ్డిన ... | ...ప్రెడ్డన. |
| | ౨౦ | సేవధుల ... | ...శేవధుల. |
| | ౨ | గాబరి ... | ...గాదిలి. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౭ | గోపురవరమున్। ... ... | గోపురమవనిన్॥ |
| | ౭ | కార్శంబు ... ... | కార్శ్యంబు. |
| | ౧౨ | ప్రకామ ... ... | ప్రకాండ. |
| | ౧౩ | మనస్కుల ... ... | మనస్కుల. |
| | ౧౭ | విగ్రపీగక ... ... | విజ్ఞపీగక. |
| ౫ | ౨౧ | బెడ్లియాడె ... ... | బెండ్లియాడె. |
| ౫ | ౨౨ | చుంకరమనురక్తిమెలగుసుజనులు మెచ్చన్॥ | బంకజబాణుని హసించుపగిది ధరిత్రిన్॥ |
| ౫ | ౨౪ | కులదీపము ... ... | కులరత్నము. |
| ౫ | ౨౬ | శతారధార ... ... | శతారమూర్తి. |
| ౬ | ౧ | యతని ... ... | అతని. |
| | ౧ | మేధా । మతి ... ... | నిధిస । స్మతి. |
| | ౮ | కామదుబ్జను ... ... | కామదుక్కను. |
| | ౮ | యల్లరుల ... ... | యెల్లరుల. |
| | ౧౨ | మందీకృత్స రిపంథిదీపని ... | మందీభూతరిపు ప్రకాశుడు. |
| | ౧౮ | సంవేద్య ... | సారజ్ఞ. |
| | ౨౪ | యాహ్వానమణుల ... ... | యాహ్వాయ సుగుణుల. |
| ౭ | ౬ | కామాక్షమానాగ ... ... | కామాక్షమయనంగ. |
| | ౧౭ | హించిదె ... ... | హించదే. |
| | ౧౭ | బక్తి ... ... | భక్తి. |
| ౮ | ౧౪ | నింకనుమదీశు ... ... | నీఘనుడెశ్రీశుః |
| | ౧౫ | సేర్పుడు ... ... | నేర్పడు. |
| | ౧౫ | భిన్నంబుజూచి ... ... | భిన్నత్వమరసి. |
| | ౧౭ | యోయివైశ్యాగ్రణీ ... | ఓయీవైశ్యాగ్రణీ. |
| | ౨౦ | దేవతులు ... ... | దేవతలు. |
| ౯ | ౮ | యమ్మునీంద్రుడు ... ... | అమ్మునీంద్రుడు. |
| | ౧౬ | శిత ... ... | సిత. |
| | ౧౯ | బొకర్తుయ ... ... | బుపేగ । న. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౦ | ౩ | ద్వైదుకు ... | ... ద్వైదిక |
| | ౭ | నృశింహ ... | ... నృసింహ |
| | ౧౦ | వేద్యంద్వైశ్రుతి ... | ... వేద్యంభైతగ |
| | ౧౧ | సత్కృకి ... | ... సత్కృతికి |
| | ౨౧ | యభవ ... | ... అభవ |
| | | యమలుఁడు ... | ... అమలుడు |
| | ౨౭ | యమి ... | ... య్యమి. |
| ౧౧ | ౧ | శిష్యమణీంద్రుడు ... | ... శిష్యమణియమది. |
| ౧౧ | ౬ | జని ... | ... చని. |
| ౧౧ | ౧౧ | పాద్యులు ... | ... హృద్యులు. |
| | ౨౬ | నమ్మహా ... | ... అమ్మహా. |
| ౧౨ | ౪ | సంస్థుతించి ... | ... సంస్తుతించి. |
| | ౮ | దుఖ ... | ... దుఃఖ. |
| | ౧౧ | నునచినర్కృశింహ ... | ... మునిచిరిన్నృసింహ. |
| | ౧౪ | జనిజని ... | ... చనిచని. |
| | ౧౪ | గనిరి ... | ... కరిని. |
| | ౧౫ | వేశి ... | ... వేసి. |
| ౧౩ | ౧౦ | యాత్మధర్మ । ... | ... యాత్మపీఠి। |
| | ౧౧ | తృణీకరు ... | ... తృణీకృతు. |
| | ౧౬ | వాడిక ... | ... వాడుక. |
| ౧౪ | ౨ | సాజ్ఞ ... | ... సంజ్ఞ. |
| ౧౫ | ౧ | యీమాణవ ... | ... ఈమాణవ. |
| | ౩ | కనిష్ట ... | ... కనిష్ఠ. |
| | ౪ | దలచి ... | ... తలచి. |
| | ౬ | నని ... | ... అని. |
| | ౧౨ | మొంది ... | ... నొంది. |
| | ౧౨ | త । మ్మఁబరి ... | ... త । మ్మంబరి. |
| | ౧౫ | న్యాయా ... | ... న్వయా. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౧౭ | యార్య ... ... | ఆర్య. |
| | ౨౧ | కొదవా ... ... | కొదవే. |
| | ౨౩ | జని ... ... | చని. |
| ౧౬ | ౬ | ఛండ ... .. | చండ. |
| | ౭ | జంఝూ ... ... | జంఝూ. |
| | ౧౧ | గావున ... ... | కావున. |
| | ౧౧ | మహస్త్ర ... ... | మహాస్థ. |
| | ౧౭ | రోడ్డుమార్గము...దనుక ... | కమలాపురంబు మార్గము పనిడంబు మీఱ. |
| | ౨౧ | గావున ... ... | కావున. |
| ౧౭ | ౪ | వారలనగ ... ... | వారుగలరు. |
| | ౨౦ | శిశ్రూష. ... ... | శుశ్రూష. |
| ౧౮ | ౧౫ | భూమిరుహముగ్గో రర్థముల్గూర్చుటల్ | భూరుహము వేగూర్చుఁ హితార్థంబనన్. |
| ౧౯ | ౮ | గాలిగోపురవరమును ... | గాలిగోపురమునుభక్తి. |
| | ౧౩ | ము।లంకరమను ... ... | ము । లంకృతినను. |
| | ౧౫ | ముసామాన్యము... సుమ్మీ ... | మసామాన్య।మ్మోపికజేయింపసుకృత మొందుదురవనిన్॥ |
| | ౧౬ | యని ... ... | అని. |
| ౨౦ | ౩ | యొత్తురె అరమ్యా... ... | యందురె ఆతమ్యా. |
| | ౮ | నుగుణనయనిధి ... ... | సుగుణనిచయన యనిధినిదగన్ । |
| | ౧౦ | వదాన్యమ ... ... | వితరణంబ. |
| | ౧౬ | కాంతల । ల్మా ... ... | కాంతల । న్మా. |
| | ౧౭ | సిష్టుడయ్యె ... ... | ధీనిధాను. |
| | ౧౯ | మిరువు ... ... | మిరవు. |
| | ౨౨ | ఈయడ ... ... | ఈయెడ. |
| | ౨౨ | పుష్పాద్రి ... .. | పుష్పాద్రి. |
| | ౨౪ | దీప్సితంబు ... ... | దీప్సితంబు. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౨౫ | నూరడింపుచుఁ ... | ... నూరడింపుచుఁ. |
| ౨౧ | ౨౨ | దెలిపెద ... | ... తెలిపెద. |
| ౨౨ | ౧ | జెప్పిరి ... | ... చెప్పిరి. |
| | ౨ | కృతిపతి ... | ... ధృతిపతి. |
| | | జవ్వవన్నెల .. | ... జవవన్నియల. |
| ౨౩ | | కథా .. | ... కథా। |
| ౨౪ | | వేద్యుడైన ... | ... వేదియైన. |
| | | అనఘుడు ... | ... అనఘుఁడు. |
| | | నెవ్వియొ। తత్తీర్థ ... | ... నెవియొతత్తీర్థ. |
| ౨౬ | ౧౪ | వైశ్వానచరిత్రము ... | ... వైశ్వానరచరిత్రము. |
| ౫౨ | ౩ | సంకర్పణోపాఖ్యానము | ... సంకర్షణోపాఖ్యానము. |
| ౫౩ | ౨౫ | మహాజమృత ... | ... మహారాజమృత. |



శ్రీ ర స్తు.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

# పు ష్పా చ ల ఖ ం డ ము.

శ్రీలావణ్యగుణానుకూలవిలసచ్చిత్తంబుగాన్పింపన । ర్మాలాపంబులప్రౌఢిమందెలి
పిని । త్యానందముఁ గూర్చుచి । క్ష్వాలౌఘామరసేవ్యమానసుమనక్ష్మాధ్రాగ్రసంస్థాయియై ।
పాలించున్మముచెన్నకేశవసమాహ్వాస్వామికారుణ్యతన్ ॥ సీ ॥ ఏమాతవదనాభిరామలావణ్యం
బుహిమధామసోదరిత్వముపహించె । నేతల్లినిజకటాక్షేక్షణంబులుకమలావాసయగుటతథ్యంబు
జేసె । నేజనయిత్రిమాధ్వీజయాలాపంబులమృతాబ్ధిసంభవయగుటదెలిపె । నేజననీసేవకేష్టద
కరములుకల్పలతానుగ్రమతజూపె । నట్టిసాధ్వీలలామకల్యాణధామ । వినుతసురభామినీస్తోమ
విష్ణుభామ । యిందిరారామమామకాభీష్టసీమ । సిరులుదయజేసినమ్మురక్షించుగాత ॥ మ ॥
తనమోమబ్జముచంద్రధారణమసందర్భంబువేరర్థసం । ధినియోచించినకంటివేడియనిసందేహింప
తాశంకరా । ఖ్యనుజైవాతృకసౌజ్ఞసోమునకునిక్కంబిచ్చికాత్యాయనీ । మనమానందతఁగూర్చు
వైద్యపతికస్మద్భక్తితోమ్రొక్కెదన్ ॥ సీ॥ ఏదేవినిజరజఃప్రాదుర్భవమువిధిసర్గహేత్వాదిమసర
ణిగాంచె। నేమాతసాత్వికవృత్తిచరాచరసంరక్షణాబ్జలోచనతదనరె । నేజననీతమోవృత్తాంత
మఖిలసంహరణరుద్రాకారమహిమజెంచె । నేతల్లికారణంజెల్లజగత్తిరోధానకేశ్వరభావదశ
నుదాల్చె । నేదయాత్మమహాకారణేచ్ఛపరస । దాశివాకృత్యనుగ్రహధర్మనిలిపె । నట్టికామే
శ్వరీసతిననయమేను । దలచినతిజేతువాక్సిద్ధిదయనొసంగ ॥ఉ॥ ధాతకుసేవకప్రమదదాతకుస
ర్వజగద్విలాసని । ర్మాతకువాగ్వధూహృదయరంజననేతకుదేవమౌనిసం । త్రాతకులోకసంచయ
దురంతమహాకలుషౌఘజేతకున్ ।చేతులుమోడ్చివందనముజేసెదనస్మదభీష్టసిద్ధికై ॥ఉ॥ శారదనీ
రదాబ్జఘనసారపటీరమరాళహీరమం। దారదరోక్షునారదశతారసుధారసచంద్రచంద్రికా।పా
రదసౌరవాజిశరపాండుశరీరవిభాగుణోల్లస । చ్ఛారదమత్కృతిస్సరసశబ్దపటిష్ఠతజూపిబ్రో
వుతన్ ॥మ॥ మునిశార్దూలతతుల్భజింపబహుపాసన్మాలస్థలాసీనుడై । తనసర్వాత్మకవృత్తివారల
కుచేతఃప్రీతిగాయోగసా।ధనలన్ జూపినిజైక్యమున్గరపుమేధాదక్షిణామూర్తిప।ద్వనజాతంబుల
నాశ్రయింతునుకవిత్వప్రౌఢవాక్సిద్ధికై ॥ మ ॥ తనతుండంబునవార్ధినీరుచదలందన్ జిమ్మియాలో

నదా। గినరక్షోధమరాజికీటములకెంగేల్గా త్రిలమర్దించిపా। వనగీర్వాణులబ్రోవకల్పతరువై భాసి ల్లుకారుణ్యాత। న్గణనాథుండుమదీయకావ్యమునవేడ్కన్బాపుప్రత్యూహముల్ ॥ ఉ ॥ శంకరదేవ తాంశమునసంభవమైపరవాదముల్నిరా।తంకమునన్జయించినిజధర్మమునిల్పివసుంధరాస్థలిన్। సంకరజాతులన్దరిమిషణ్మతముల్ప్రకటించినట్టియా । శంకరదేశికేంద్రుపదసారసముల్మ్రొనస లంటప్రమొక్కెదన్ ॥ సీ ॥ ఏదేశికేంద్రునిపాదాంబుజాతంబులఖిలసేవకజీవనామృతంబు। లేగురు ప్రభుదయాభాగధేయంబుసంసారపయోరాశితారకంబు । నేమహామహుబోధలిష్టలింగార్చనా రతులకులింగైక్యరంజనంబు । లేస్వామినిజకటాక్షేక్షణలజ్ఞానతామిస్రకాపథతపనరోచు । లత డుకవిరాజుసకలవిద్యాప్రవీణు। డూద్భటారాధ్యవంశసముద్భవుండు। వీరభద్రగురుస్వామివిన యగామి । లలితమద్వాగ్ముఖంబుననిలచుగాత ॥ఉ॥ పాణిపుటంబుమోడ్చెదకృపామతినాకుజబా దరాయణ । స్థాణుసమానబాణకవిశంకరబిల్హణకాళిదాసగీ । ర్వాణకవీంద్రరాజికినవశ్యము శబ్దరసప్రబంధస । ద్వాణియుమాకొసంగుమనితత్పదముల్మదినిల్పివేడుకన్ ॥క॥ నన్నయతిక్క నభాస్కరు। లన్నిజచిత్తముననిల్పిలాలితకవితో । త్పన్నరసశబ్దకృతిసం । పన్నునినను జేయుమ నుచుప్రార్థనజేతున్ ॥వ॥ అనియిష్టదేవతాప్రార్థనంబునుగురునమస్కారంబునుసంస్కృతాం ధ్రకవీంద్రవందనంబునుగావించియొక్కపురాణంబుదెలింగింపంబూనియున్నసమయంబున ॥ చ ॥ జలజభవాండమందుద్విజసత్తమరాజకిరాటజాతులన్। దొలుతసృజించిజీవనవిధుల్గలిగింపగమా నసంబులో । పలదలపోసిసమ్మదవిభాసురకౌశలమొప్పబిమ్మటన్ । నలువజనింపజేసెనిలనా లవజాతికృషిప్రసిద్ధులన్ ॥ గీ ॥ వారిలోపలకొందరవార్యతేజు । లాత్మవిజ్ఞాననేత్రులైయలరుట యును । కర్మనయనులలోపలఘనతగాంచి । వసుధనెన్నగపెడకంటివారలైరి ॥ ఉ ॥ ఆపె డకంటివారలుమహత్వగురుత్వవదాన్యకార్యవి । ద్యాపరిశీలనంబులసమర్థులువారలలోననెన్నని। ష్పాపులుదుగ్గిరెడ్డికులసంభవులాఢ్యులుసత్యభారతీ । వ్యాపకులార్యసమ్మతులువంశవివర్ధనులా ర్తపోషకుల్ ॥ గీ ॥ కడపదేశాంగనాతిలకంబనంగ । సుంకెశిలయనుపురమునసుస్థిరముగ । త మకుకాణాచిగాగనుతరతరంబు । కాపురముజేసిరాఢ్యులైఘనతమించి ॥ క ॥ ఆదుగ్గిరెడ్డికుల మున। ప్రాదుర్భవుడయ్యెనైజబాంధవహితుడై । శ్రీదయితునికృపచేతను । బీదలనార్తులనుబ్రో చుపెద్దయ్యయనన్ ॥గీ॥ శిరులకునుపెద్దసద్గుణచిత్తశుద్ధి। భక్తివిజ్ఞానచాతురీప్రాభవముల। పెద్ద సంతానములకెల్లపెద్దహొగడ । నవనిలోదుగ్గిరెడ్డిపెద్దయ్యరెడ్డి ॥ సీ॥ కలభువనంబులోకులకెచ్చి వెల్లనైయద్రులజేరువాడతడుఘనుడె।పొలిబోనికళలువిబుధులకర్పణజేసివనటజెందినవాడువసు కరుండె। జీవనంబులుగొనిజీవనంబులొసంగియహిభయంబునగుందునతడినుండె। సురచిరార్థము

లునిర్జరులకుసమకూర్చియాదిచింతవహించునదియుమణియె । వెల్లబోవడుకందడుభీతిచింత ।
లెంచడుఘనుండువసుకరుండినుడుపురుష। మణియునితడేయనగకవిమణులకిష్ట।మియ్యజేజేలగిడ్డి
పెద్దయ్యరెడ్డి ॥క॥ సదయుడుపెద్దయరెడ్డికి। సుదతీమణులిరువురైరిసువ్రతహితలై। పెదయక్క
మచినయక్కమ । ముదమొదవగహరికిలక్ష్మీభూమియుబోలెన్ ॥ క ॥ ఆపెదయక్కాంబాహ్వ
స । దాపాతివ్రత్యశీలధర్మాచరణ । వ్యాపారబంధురక్షణి । యాపడతికిసరియెమానవాంగన
లెలమిన్ ॥ మ ॥ మదికాహ్లాదమొనర్పబాంధవులసన్మానింపసద్భక్తిసం। పదలుప్పొంగపతిన్భజిం
పగురులన్ బ్రార్థింపనుద్యద్దయా । స్ఫదచిత్తంబునదీనసత్కవులనిచ్ఛాస్ఫూర్తిగాబ్రోవసీ। పెద
యక్కమ్మసమానులేరిధరలోపేరెత్తివాక్రువ్వగాన్ ॥గీ॥ అట్టిదాంపత్యమన్యోన్యహర్షమొప్ప।
తనయులనుగాంచిరిరువురధర్మపరుల । చిన్నవెంకటరెడ్డినిచిరయశస్కు । వెంకటాహ్వయు
దానప్రవీణమతుల ॥క॥ అందగ్రజుండుబుధజన। బృందారకభూజమనగబెంపొందెమరు। త్సుంద
రుచినవెంకటరె । డ్డిందరమెనుతింపగావడిన్ కవులకిలన్ ॥సీ॥ కట్టించెనెవ్వాడుకమనీయమం
టపద్వారవిస్తీర్ణరామాలయంబు । పెట్టించెనెవ్వాడుభిక్షాన్నసత్రమవారితంబుగజైత్రవాసర
ముల । పట్టించెనెవ్వాడుపల్యంకికాఛత్రచామరంబులురాజసత్కృతులను । మట్టించెనెవడుదు
ర్మార్గశాత్రవులనువీరాట్టహాసంబువిస్తరింప। నతడుదుగిరెడ్డివంశపయోంబురాశి। పూర్ణజైవాతృ
కుండుసంపూర్ణయశుడు । రామపాదారవిందమరందచంచ । రీకుడగుచిన్నవెంకటరెడ్డివిభు
డు ॥ క ॥ ఆతనికనుజన్ముండై। చేలోజవసంతహరిజశీతాంశువిభా । తీతనిజసుందరాంగ। ఖ్యా
తుండనమించెవెంకటాహ్వయుడిలలోన్ ॥ ఉ ॥ రంకుహృదంతరంబునను । రంజిలబోవడుసద్గ
ణంబులన్। బొంకమడంపగాజనడుపొందికమాన్పికవిప్రబంధమున్। సంకులమొందనీడుతనసా
రమొకప్పుడుతగ్గనీయడా । వెంకటరెడ్డిచంద్రునివివేకములెన్నదరంబెనేరికిన్ ॥ గీ ॥ అట్టియను
జుండుతనసేవలర్థిన్జేయ । రిపుభయుడుచిన్నవెంకటరెడ్డివిభుడు । కాంతుడళుకొత్తనెల్లాం
బికనువరించె। మరుడురతిరీతిబంధుసమ్మతముగాగ ॥ఉ॥ సమ్మదమొప్పవల్లభునిసత్యముదైవము
గాదలంచిని । త్యమ్మనురాగభక్తిగుణతత్పరయైనిజభోగభాగ్యసౌ । ఖ్యమ్ములుగాంచిసద్యశ
ముగైకొనిమించినదుగ్గిరెడ్డియె । ల్లమ్మకుసాటియాదురధరాంగనలెల్లనుశాంతిదాంతులన్ ॥గీ॥
యవనిచినవెంకటాఖ్యుడెల్లమ్మయందు । తనయులనుగాంచెకామసుందరులపెద్ద । నాగిరెడ్డిసమా
ఖ్యునినాగిరెడ్డి। వెంకటాఖ్యులధర్మవివేకఖనుల ॥ ఉ ॥ వారలకగ్రజుండుకవిబాంధవుడాపెదనా
గిరెడ్డిమం । దారమభీష్టదాయివిబుధప్రతతిప్రియమాత్మసౌమన । స్సౌరభసారసంతుషితస్వప్ర
భులోకములోకభీతిసం। హారమటంచుపండితులుమాన్యయశోధనునెంతురెల్లడన్ ॥క॥ తదనుజు

డుకామీసీనవ । మదనుండగునాగిరెడ్డిమనుజేంద్రుఁడుసం । పదలుదళుకొత్తదానా । స్పద్రైవీ
నాథీజనులసంరక్షించెన్ ॥ సీ ॥ దాల్పఁడేవిబుధసంత్రాణవిధిఖ్యాతిస్వకళావదాన్యవిచారము
లను । వెలయఁడేసంపూర్ణవిభవప్రసాదతనహిభయోద్రేకంబునడుగుపరచి । బూనఁడేనైజప్రి
యానుబంధస్ఫూర్తిపరచక్రసంహారపటిమవలన । మట్టఁడేలోకతమచ్ఛటాహంకృతియుజ్వలత్స్వీ
యపుణ్యోదయమున । తనయశోవృద్ధిసుకవిసంతానతృప్తి । కువలయానందమేప్రొద్దుగోరుననుచు ।
సాటివారలుబల్కరంజనతగాంచె । వసుధలోనాగిరెడ్డిజైవాతృకుండు ॥క॥ ఆనాగిరెడ్డితమ్ముఁడు ।
శ్రీనాథపదారవిందసేవాసక్తుం । డానతవైరిపరాక్రము । డానందావహుఁడువెంకటాహ్వాయు
డలరున్ ॥ ఉ ॥ ప్రల్లదమాడఁడెల్లరులబంధుసమానులుగాఁదలంచుసం । పల్లలనామనోహరునిభ
క్తికిఁబ్రోడకృపామృతంబుసం । ధిల్లకవీంద్రమార్గణులనిత్యమురక్షణఁజేయుకీర్తిశో । భిల్లఁగవెంక
టాహ్వయునభేద్యచరిత్రములెన్నశక్యమే ॥గీ॥ అట్టిసోదరరత్నత్రయంబులోన । మధ్యమణినాగి
రెడ్డిసమ్మదముమీర । సిరులమించెనులోకప్రసిద్ధుఁడగుచు । ధర్మసద్గుణపాళివదాన్యమౌళి ॥ఉ॥
పెద్దయరెడ్డిపిన్నసతిపెంపుదలిర్పఁగనక్కమాంబయ । న్మద్దియరాఘవాంఘ్రులననూనపరంగతిసా
ధనంబులిం । కెద్దినిరర్థకంబనుచహీనమతిన్నిజభక్తిరక్తులన్ । దద్దయుజైత్రికోత్సవవ్రతంబులసే
యుననేకదానముల్ ॥ క ॥ పరపురుషులమదిదలపదు । పరసంపదకాసపడదుపతిదైవముగా ।
బరికింపుభూమిలోనీ । పరమపతివ్రతకుసాటిభామలుగలరే ॥ఉ॥ అనలినాక్షిపెద్దయసమాఖ్యుని
గూడిమహానురక్తిసం । తానముగాంచెగుర్వయనుదారునిపెద్దమిచిన్నమిన్పరి । జ్ఞానులరామలక్ష్మ
ణులసత్యవచస్కులరామదివ్యప । ద్ధ్యానులపూర్ణకాములనుధర్మవిధిజ్ఞులగర్వహీనులన్ ॥ క ॥
యొప్పగునందేలాన్వయ । తిప్పాహ్వానునకునమృతదీధితిముఖియా । నప్పాలతిచిన్నమాంబను ।
కప్పురవిడెమిచ్చిపెండ్లిగావించిరొగిన్ ॥క॥ మేలగుదంపతులకుదు । ర్వేలరెడ్డినసుతుఁడుపుత్రిధీమతి
వరదాం । బాలలనగల్గిరిరువురు । శ్రీలక్ష్మీనాథభక్తిసేవధులనగన్ ॥ క ॥ సవినయతిప్పాహ్వ
త్స్మో । ద్భవవరదాంబాఖ్యవిపులపాతివ్రత్య । స్తవనవరియించెశివుగా । రివలెన్దుగిరెడ్డినాగిరెడ్డిని
పేర్మిన్ ॥చ॥ పరమపతివ్రతామణివిభావిభవంబులప్రోవుదీనసత్క । రకరుణాలవాలనిజధర్మసము
జ్వలదానశీలభా । సురహరినీలవాలకవిసూరిగణావనమూలమైననీ । వరదమసాటిబోల్పదగువా
రలులేరుజగత్రయంబునన్ ॥ సీ ॥ తనరజోవృత్తిపొంతలఁజేరనీదేనిధరణీసతినిసాటిదలపవచ్చు ।
తనచంచలంబుమాన్పినగుణంబెబ్బైనాశ్రీదేవినీడుగాజెప్పవచ్చు । తనతమఃస్ఫూర్తినర్థముపతిన
డుగదాపార్వతిసమముగాబలుకవచ్చు । తనమువాచాలత్వమునుబాసియుండెనానలవాణిసరిగా
గనాడవచ్చు । ననగరాజసచలనదర్పాదులడచి । బహుళభాషిణిగాకతాపతికిమూర్తి । సేవలో

నరించిధర । లోనసేరులమించె । ఘనసుగుణపేటివరదాంబికావధూటి ॥ మ ॥ మదనాకారు
డుగంగిరెడ్డికులసంభావ్యుండుదారాత్ముఁడౌ । పెదనారప్పసమాఖ్యుఁగాబిలిసుతంబెండ్లాడెనెల్ల
మ్మనిం । పుదలిర్పఁజినభార్యగాతనకునామోదంబిడన్నాగిరె । డ్డిదయాంభోనిధిమించెను
ర్వరనుప్రౌఢీభూతచేతస్కుఁడై ॥ క ॥ ఆనాగిరెడ్డివరదాం । బానలినదళాక్షియందుపటుతర
గంభీ । రానూనరూపజితనవ । సూనాస్త్రునివెంకటాఖ్యసూనునివడసెన్ ॥ క ॥ ఆవెంకట
రెడ్డికృపా। సేవధిహరిశంభుపాదసేవకుడగుటన్। గావించెపుష్పగిరిపై । కోవిదులెన్నగనుగాలి
గోపురవరమున్॥ సీ ॥ సత్పథాంతరమునసంచారమేకానికార్యంబుమానడుకంజవైరి । దానధా
రావివర్ధనగానికటముపైకప్పుమాన్పదుదేవకరివరంబు । నవనిభరింతుతాననెగానినిజవిషచేష్ట
మానండాదిశేషమూర్తి। హరపదావాసమాహాత్మ్యమేకానికరినతమానెనెరాజితనగరాజ । ప
నుచుతనకాంతిజగములనాక్రమించ । సజ్జనానందకలితమాసరణిగాంచె। నౌరవిద్వద్విచారప
హానురాగ । దీప్తవెంకటరెడ్డిసత్కీర్తికాంత ॥ చ ॥ విరళకళాభిరాముడగువెంకటనామసు
ధాకరోదయం । బరులనుదోలివిష్ణుపదమందునబ్రాకిశుచిప్రకామవి । స్ఫురణతమించిసద్బుధు
లపూర్ణమనస్కులజేసిలోకభీ। కరవిచలత్తమచ్ఛటలఖండనజేసెజగద్ధితంబుగన్ ॥ గీ ॥ నందిరె
డ్డికులాబ్ధిపూర్ణేందుడైన। వెంకటాఖ్యునిసుతనువివేకశీల। కలితచెంచమ్మనామకకమలనయన । న
గ్రమహిషిగనతడుపెండ్లాడెకూర్మి ॥ సీ ॥ దీనార్థిజనులసందియముబాయంగనభీష్టార్థవితతు
లనివ్వనేర్చు । దైవసమానుడేథవుడనియనురక్తిసేవలింపెసగంగజేయనేర్చు । విభవాతిశయ
మునవిద్రవీగకనభ్రమభావంబుతోడనప్రబలనేర్చు । సకలధర్మాధర్మసరణిమానసముంచిసమవృత్తి
కాలంబుజరుపనేర్చు । నౌరయీసాధ్విసర్వలోకాభినంద్య । యనగవిఖ్యాతిగాంచెపావనచ
రిత్ర। యమలరుచిసీమపతిదేవతాభిరామ । భవ్యగుణధామచెంచమాంబాలలామా ॥ గీ ॥ అవ
నివెంకటరెడ్డిసమాహ్వయుండు । నుభయకులములకానందమొసగుచున్న । కలికివరదమ్మనా
మకకమలముఖిని । పిన్నసతిగావరించిదాపెడ్లియాడె ॥ క ॥ వెంకటరెడ్డిసమాఖ్యుడు । పం
కజముఖులిరువురకుకృపాహృదయుండై । సంకల్పితవిభవములిడు । చుంకరమనురక్తిమెలగె
సుజనలుమెచ్చన్ ॥ ఉ ॥ ఆపెదరెడ్డిపిన్నసతియక్కమపుత్రులుగుర్విరెడ్డియు । ద్దీపితరామిరె
డ్డికులదీపములక్ష్మణరెడ్డికావ్యవి । ద్యాపరిశీలనప్రియులుదారయశోధనులార్యసమ్మత । వ్యా
పకులైచెలంగిరరివారదురంతవనీకుఠారులై ॥ ఉ ॥ అందులనగ్రజన్ముడభియాతినగేంద్రశతార
ధారమ । ధ్యందినసూర్యతేజుడతిధర్మపటిష్ఠుడుగుర్విరెడ్డిమా । కందముసత్కవీంద్రులకుకా
మ్యఫలంబులొసంగిసంపదా । నందముజెందెపేర్మిజననాథసమాజములన్ మహోన్నతిన్ ॥...*

క॥ యతనిసహజుండుకరుణా । న్వితుడుబుధాశ్రితుడునిఖిలవిద్యామేధా । మతిరామిరెడ్డిధీమణి।
కుతలంబునతేజరిల్లెకోవిదులెన్నన్ ॥ ఉ॥ కామవికారిగాకపురఘస్మరుపాదసరోజచింతనో।ద్దా
మమతిన్ కృతార్థుడుయథావిధివిద్యలనభ్యసించిశ్రీ । రామజయంతులన్మిగులరంజిలసేవలొనర్చి
భోగసు । త్రాముడురామిరెడ్డిగుణధన్యుడుమించెవసుంధరాస్థలిన్ ॥ ఉ॥ అమ్మహితాత్మసో
దరుడహస్కరతేజుడులక్ష్మిరెడ్డిని। త్యమ్మున్శివార్చనానియతిదప్పకరామజయంతులందుసా। ఖ్యమ్ము
గుదివ్యభోజనపదార్థములన్ జతగూర్చివిప్రసం । ఘమ్ములకన్నపానములుకామితముల్దయసేయు
వేడుకన్ ॥ సీ॥ ద్విజులనాక్కటబ్రోవదెలసెనేద్విజరాజుపక్షపాతంబుజేపట్టిగాక । ఘనుడ
య్యుకోరువేళనుజీవనంబిచ్చిబ్రోచెనేతనజడబుద్ధిగాక । కామదుఖ్ఖినుపేరుగల్గియల్లరులకిష్టంబు
లిచ్చెనెపశుసాజ్ఞగాక। మిత్రుడైగొన్నసొమ్మేయిచ్చెననుటగాతపనస్వభావమేతనరెననుచు। స
ర్వసమతనయాచితసౌఖ్యమిష్ట। కామ్యమునిజార్జితంబులోకములుమెచ్చ । నర్థిజనములకిడిబ్రో
చెనారమగ్గి । రెడ్డివంశోద్భవుడులక్ష్మిరెడ్డివిభుడు ॥ శా॥ హిందూహ్వాణసమాజకార్యఘటనా
హీనప్రతాపప్రభా । మందీకృత్పరిపంథిదీపనిహనూమన్నందిలీలాపతా । కాంచవోళీమదసామ
జోష్ట్రిరథవాజ్యైశ్వర్యగుంలక్ష్మిరె । డ్డిందేవేంద్రసమానభోగియనిసాటింపందగున్ధారుణిన్ ॥
క॥ అలగంగిరెడ్డికులవా। బిళరెడ్డిసమాఖ్యసుతనపారచరిత్రా।కలితనునాగమసాధ్విని । బలు
వేడుకలక్ష్మిరెడ్డిపరిణయమయ్యెన్ ॥ గీ॥ పిచ్చపాటికులీనుడైపెంపుమిగులు । తిమ్మయాహ్వా
యుపుత్రిసతీలలామ । నమలగుణగణధామచెంచమ్మనామ । ననఘుడాలక్ష్మిరెడ్డిపెండ్లాడెకూ
ర్మి ॥ క॥ ఆయిరువురుభార్యలలో । బాయనియనురక్తితోనపారగుణశ్రీ । ధీయుతయైపతిసేవ
లుజేయుచునానందవశతచెంచమయొప్పన్ ॥ సీ॥ సకలధర్మాధర్మసంవేద్యయగుటచేసమవర్తి
కాంతయీచంద్రవదన । సౌభాగ్యవైభవాస్థానపీఠికగానమఘరిపుసాధ్వియీమదిరనేత్రి ।
బహుళవాక్చాతురీప్రబలినదౌటతామరసజురాణియీమధురవాణి । సాహసగంభీరసారా
త్మకయగానశంకరురమణియీసతిలలామ । యారయీమానినీరత్నమనగవినుతి । గాం
చిబాంధవహితజనకవులబ్రోచు । వినయయైసేవలొనరించువిభునియెడల । బహుసుగుణపే
టిచెంచమాంబావధూటి ॥ గీ॥ అట్టిసతియందులక్ష్మణాఖ్యానఘనుడు । సుతులనలువురగాం
చెసుప్రతులహితుల । వెంకటస్వామిచెన్నయ్యవిమలకీర్తి । సమరుశివరామకృష్ణయాహ్వానమ
ణుల ॥ క॥ అందగ్రజుండుభోగపు । రందరుడగువెంకటాఖ్యరసికుడుసరసా । నందప్రద
యుండుబుధజన । మందారంబనగవెలసెమహిమోన్నతుడై ॥ సీ॥ శ్రీరామపదసరసీరుహాసేవ
రే. పావనుడటిఱోడబాయకుండు। నైజదేశికపూజనక్రియఁజెవ్వనిభక్తిలతాశిఖాప్రసవమయ్యె।

సకలదీనాభీష్టసంధానమెవనివితరణకల్పకఫలోదయతగాంచె । సత్యాలపనమణిజన్మశైవ్యాని
వాక్స్థానమాకరరీతిదనరునతడు। వెలసెభువిలోనదుగరెడ్డికులపయోధి। శీతకరలక్ష్మణార్ధాంగిచెం
చమాఖ్య। మానినీగర్భశుక్తిసంభవదనర్ఘ్య। మౌక్తికమువెంకటస్వామిమనుజవరుడు ॥గీ॥ వసు
ధదుగిరెడ్డివెంకటస్వామిగంగి। రెడ్డినారపసుతనువరించెసతిగ। భవ్యనారాయణమ్మనాపద్మము
ఖని। బాంధవులుమెచ్చసంతోషభరితుడగుచు ॥గీ॥ వరిదిరెడ్డికులాబ్ధిజైవాతృకుండు।రామిరె
డ్డితనూజపురంధ్రిసుగుణ। కలితకామాక్షమానాగచెలినిపిన్న। సతిగపెండ్లాడెవెంకటస్వామిరె
డ్డి ॥క॥ ప్రేమనుతనపతివెంకట। ధీమణియేదైవమనుచుదిరముగసేవ। ల్నేమమునసేయరక్తిన।
కామాక్షమ్మకుసమానకాంతలుగలరె ॥క॥ అరసికుననుజుడగుచె। న్నారెడ్డియశంబువెలసినార
దశరక । ర్పూరనవహీరపాండుర । సారంబుననాక్రమించెజగములనెల్లన్ ॥సీ॥ సాధింపడే
యరిషడ్వర్గగజపంక్తిస్వగురుపద్భక్త్యంకుశంబుబూని। వేధింపడేదుష్టవిషయశుష్కాటవిపంచా
శుగాగ్నిప్రఘాతతులను । శోధింపడేశాస్త్రచోదితధర్మముల్విజ్ఞానదీపార్చివెలుగజేసి। రోధింప
డేకర్మపాథోధిహరిహరగణనాప్తిచెలియలికట్టవలన। నతడుహయాణాధికారసింహాసనమున।న
వనిపాలింపతనవ్యవహారమునకు। సజ్జనంబులుసంతోషసరణిగాంచ । మెలగెచెన్నయరెడ్డిభూ
మిప్రభుండు ॥గీ॥ వసుధపడిగెపాటివంశసంభవుడైన।వీరయాఖ్యపుత్రివిమలగాత్రి। నంకమాం
బనాగనఖ్యాతినతడుపెం। డ్లాడెకూర్మిచెన్నయాహ్వయుండు ॥చ॥ గురులసుబంధుకోటినను
కూలమతిందగబ్రోచుదేవతా। వరులనుబూజసేయుపెరవారలనైనసుతానురక్తితో। నరయుపతి
వ్రతాతిలకమౌరకృతార్థతనావహించిదే।హరిహరభక్తిశీలకలితాంకమనామవధూలలామమున్ ॥
క॥ ఆచెన్నయాఖ్యునుజుడు। మోచాఫలచతురవచనముదితార్యుండై। యాచకులబంధుజనము
ల। బ్రోచునుశివరామిరెడ్డిభూరికృపాప్తిన్ ॥చ॥ పరమకృపానుసారినిజపాపవిదారిపరోపకారి
శాం। కరపరమంత్రరాజజపకారణతత్వవిచారిధైర్యమం। దరగిరినెన్నగాదరమెధర్మసమంచితని
త్యసద్గుణా। కరశివరామిరెడ్డిబుధగణ్యవదాన్యవిహారినిర్ధరన్ ॥గీ॥ అతులయెమరూరివంశపాప
న్నసుతను। నాగమాంబనుపెండ్లాడినయముమీర। భవ్యశివరామిరెడ్డివైభవముగాంచె। నఖిలజను
లకునానందమావహిల్ల ॥క॥ తదనుజుడైమించెనుశశి ।వదనుడుకృష్ణాహ్వయుండవారితకీర్త్యా।
స్పదుడైబుధజనకవులను। ముదమునబోషించుసుగుణములువిలసిల్లన్ ॥చ॥ వితరణికృష్ణయా
హ్వయవివేకికవీశ్వరధీరసాహసం। తతులనుబ్రోచుకర్ణశిబిధర్మతనూజసలావసీశక। ల్పతరుసుధా
కరాంబుదవిలాసముగైకొనిశైవమార్గసం । గతహృదయాంబుజాతుడయిగణ్యతమించెజగత్ప్రసి
ద్ధిగన్ ॥గీ॥ అవనిబుసిరెడ్డివంశమల్లయ్యరెడ్డి। సుతసుసిద్ధాంబికానామసతినికూర్మి । పరిణ

యంబయ్యెబాంధవప్రతతిమెచ్చ । నమలమతిదుగ్గిరెడ్డికృష్ణయ్యరెడ్డి ॥ గీ ॥ అట్టిమగిరెడ్డికులమ
ణిహారమునకు । నవ్యనాయకమణినాగనాగిరెడ్డి । వరదమాంబాతనూజుఁడైవన్నెగాంచె । రిపు
హరుండగువెంకటరెడ్డినృపతి ॥ క ॥ తమవంశపరంపరగా। కమలాక్షుమహేశపాదకంజాతము
లు । త్తమరీతిగొలిచిసుఖములు । తమవారందరునుగాంచతావేడుకతోఁ ॥ ఉ ॥ శైశవమాది
గావిపులశాంకరభక్తివిలాసచిత్తసం । కాశతనుండియొక్కతరికాలవశంబునవెంకటాద్రి
కిఁ । కేశవుజూడగానరిగికేవలదాస్యతవెంకటేశునా । త్మేశునిగాఁదలంచెతనకిష్టమహావిభ
వంబులివ్వగఁ ॥ గీ ॥ పరమకరుణగల్గిపద్మాక్షుఁడిష్టార్థ। మిచ్చెనాత్మనాథుఁడిమ్మహాత్ము। ఁడనుచు
వారిసేవకనురాగమునమూఁడు । సార్లుజనియెభక్తిసహితుఁడగుచు ॥ ఉ ॥ అచ్చటవెంకటేశ్వ
రుపదాబ్జములేరికిగానరామియుఁ । తచ్చరితన్సమగ్రతగదన్యులచేవినిదుగ్గిరెడ్డివం। శోచ్చయ
కీర్తిశాలిమదనోపమవెంకటరెడ్డినామకుం । డిచ్చదలంచెపుష్పకుధరేశ్వరుకేశవువెంకటేశు
గఁ ॥ అనియిట్లునిశ్చయించి ॥ గీ ॥ అంతనొకనాఁడుమిట్టాన్వయాబ్ధిచంద్రు । డైనసుబ్బయశె
ట్టివైశ్యప్రభూతు । డనుసరింపుచురాగపుష్పాద్రికరిగి । తగపినాకినినీరాడిదానువేడ్క ॥
గీ ॥ పుష్పగిరిమీదికెక్కిసంపూర్ణభక్తి। చెన్నకేశవపదసరసీరుహములు । గనికృతార్థుఁడనైతినిం
కనుమదీశు। డైనశ్రీవెంకటేశ్వరుండనుచునెంచి ॥ క ॥ శ్రీపతిశివులకునేర్పడు । గోపురభిన్నం
బుజూచిగుందినమదిత। ద్వ్యాపారమువైశ్యుఁడువిన। నాపన్నతబల్కెవెంకటాఖ్యుఁడుకూర్మిఁ॥
క ॥ ఓయివైశ్యాగ్రణీయ। న్యాయముగోపురముభిన్నమైనదిమరలం। గాయత్నింపనుమదభి।
ప్రాయమునూల్కొనియెనేఁడుభవ్యచరిత్రా ॥ ఉ ॥ మానధనుండువెంకటసమాహ్వయుఁడిట్ల
నువేళలోఁపలఁ। స్థానమువంశపావనుఁడుతజ్ఞుఁడుకాశ్యపగోత్రుఁడార్యసం। తానమహీరుహంబ
నవదాన్యతమించినపాంచరాత్రవి। ద్యానిధిచెన్నకేశవసమర్చకుఁడాఢ్యుఁడుధీరుఁడన్నిటఁ ॥ గీ॥
సజ్జనుఁడుతిర్మలార్యుఁడచ్చటికిరాగ । గాంచియాగోపురముముందుకరణినుండ । కట్టమతిగల్గె
ఫలమేమిగలదుజెప్పు। డనగనాగమసూక్తులనరసిబలికె ॥ చ ॥ వినుమిటసర్వదేవతలువిష్ణువు
శంభుఁడులోకజన్మపా। వనకరతీర్థయుక్తతనివాసముజేసిరిసర్వవాహినీ। ఘనముపినాకినీనదియ
కల్మషచిత్తులజేయునెట్టివా। రినిమహనీయమీస్థళమురెడ్డికులాభరణాధ్రువంబుగఁ ॥ క ॥ ధీర
నుతివినుపినాకిని। వారుణతీరమునగలఁడువైద్యేశుఁడుత । త్కారుణ్యమఖిలజనముల । దారుణజా
ఢ్యాటవులనుదరగదెభువిలోఁ ॥ క ॥ గావునగోపురమీవీ। దేవస్థానమునకెమటవృథమతిగట్టిం।
గావేడుకగల్గెనుత । త్పావనతరపుణ్యఫలముబల్కెదవినుమా ॥ గీ ॥ శిరముశిఖరంబుగర్భమంది
రముగళము। జఠరమగుమండపముజానుజంఘలువర। ణంబుగోపురమంఘ్రియుగంబుక్షేతు। వసువ

నుచుజెప్పబడెకారణాగమమున ॥ గీ ॥ గానసర్వజనంబులుగాంచనరిది । హరిపదంబులుగాలి
గోపురముగల్గ । రసనుసర్వజనోపకారంబుగాదె । హితముమాకిదికట్టింపుమీవుబూని ॥ వ ॥ మ
రియునింకొకవిశేషంబుజెప్పెదనాకర్ణింపుము ॥ గీ ॥ అనఘయిచ్చోటకాశీప్రయాగగయలు । గ
లవటంచనిదెలసిశంకరగురుప్ర।భుండునివసించెవినుముతత్పూర్వకథను।సావధానతజెప్పెదశ్రా



※శ్రీవిద్యానృసింహభారతీస్వామిగురుపరంపర※

వ్యముగను ॥ క ॥ శ్రీవిశ్వవిభుండుమహా । దేవుండాత్మైక్యసిద్ధిదెలిపెనుకృపతో । గోవిందునకు
న్మునిహిత । కైవల్యానందవిమలకంఠీందునకున్ ॥ గీ ॥ అట్టినారాయణుండువర్ణాశ్రమముల । వి
ధులశాసించిబ్రహ్మైక్యవిభవవిధము । కరుణనుపదేశమొనరించెకమలజునకు । స్నేహముననాత
డిచ్చెవసిష్ఠునకును ॥ గీ ॥ యమ్మునీంద్రుడుకృపనునిజాత్మజాత । శక్తికుపదేశమొనరించెసవయు
డతడు । ప్రబలజేసెనుఘనతపరాశరునకు । బాదరాయణుడతనిచేబడసెనంత ॥ క ॥ వేడినశు
కునకతండిడె । గౌడపదాచార్యులట్టిఘనుచేవడసెన్ । వేడుకనమ్మునిదయతో । గూడుకగోవింద
నామగురుడుగ్రహించెన్ ॥ క ॥ అంతటలోకవిలోక । ధ్వాంతంబైకలియుగంబుదారసిలంగా ।
భ్రాంతిన్తద్ధర్మంబ । త్యంతక్షయమగుటదెలసిహరుడనురక్తిన్ ॥ శా ॥ ధారుణ్యంతరపూర్ణదు
ష్టమతవిధ్వంసంబుగావింపకా । వేరితీరమునందుకాకటిపురిన్విప్రాన్వవాయస్థుగా । గౌరీభర్త
నిజాంశశంకరగురున్గల్పించెబ్రహ్మోగమో ।ద్ధారున్తత్త్వవిచారుముక్తికమలాధారున్శుభాకా
రునిన్ ॥ గీ ॥ పరమశంకరదేశికోత్పత్తివేళ । సురలుసుమవృష్టిగురిసిరచ్చరవెలందు । లాడిరమర
మునీంద్రుండుబాడెగీతి । తుములమైమింటదేవదుందుభులుమ్రోసె ॥ క ॥ శితపక్షచంద్రురీతిన ।
ప్రతిదినమభివృద్ధిజెందుబాలునకువిధి । స్థితితజ్జనకుడుబుధస । మ్మతముననుపనయమున్క్రమంబు
గజేసెన్ ॥ క ॥ కేవలశివాంశసంభవు । డావటుమాణవకశంకరాహ్వయుడుజగ । త్పావన
పానీయోజ్జ్వల । కావేరీస్నానమాడగాజనివేడ్కన్ ॥ గీ ॥ అందుజలమాడువేళగ్రాహంబొ
కర్తు । యమ్మహాత్మునిబట్టసన్యాసమాత్మ । దలచిగైకొనుమాత్రలోదద్వటునకు । జన్మవేరనివిడచె
నజ్జలచరంబు ॥ క ॥ జలమాడిలేచియయ్యతి । తిలకముగోవిందనామదేశికుచేవి । ద్యలనరువదినా
ల్గిటిబెం । పలరగనరువదియునాల్గహంబులవడసెన్ ॥ గీ ॥ యమివరాగ్రేసరుడువారణాసికరిగి ।
మండలేశ్వరుగెలిచిసంయమినిజేసి । యతనిసాధ్విసరస్వతినాత్మపీఠ । మందునుండగనియమించె
నతులభూతి ॥ గీ ॥ ఘనుడుకైలాసముననులింగములునాల్గు । దెచ్చిలింగత్రయంబుదగ్గిశనుమూ
డు । పీఠములనుంచితానుసంప్రీతిమీర । నొకటిగొనితెచ్చెయామ్యమునకుసరగున ॥ గీ ॥ తత్పరి
వ్రాట్ప్రభుడుషణ్మతములనిలిపి । యన్యమతములఖండించిహర్షమునను । తుంగభద్రాసమాహ్వ

నఘనితటమున । ఋష్యశృంగాద్రిపురి కేగి మృడుని గొలచి ॥ గీ ॥ శారదావాస నైజసంస్థానమచట । కల్పనము జేసి శిష్యునాక్కరుని నిల్పి । దాచిదంబరమున కేగి తనువుతోడ । పరమగురువర్యుడపవర్గపదవి జెందె ॥ ఉ ॥ ఆదిమశంకరార్యులుదయామతి నిల్పిన శంకరుండుత । ద్వైదుకధర్మమార్గము యథావిధి దెల్పె సురేంద్రమూర్తి కా । మోదముతోడ నాగురుడు ముఖ్యతబోధనమానికిచ్చె దే। వాదులకైన దుర్లభమహత్తరతత్త్వవిచారమంతటన్ ॥ గీ ॥ సంయమీంద్రుండు భోధనాచార్యమౌళి। జ్ఞానఘన దేశికునకిచ్చె మానివర్యు। డతడు జ్ఞానోత్తమశివార్యయతికొసంగె ।నమ్మునినృశింహభారతియమికి నొసగె ॥ క ॥ నరశింహభారతులు నీ । శ్వరభారతులకు నొసంగె వారు కృపాప్తిన్ ।నరశింహమౌని భారతి।గురువర్యులకిడియె తత్త్వకోవిదపదవిన్ ॥ క ॥స్మర్థత నమ్ముని విద్యా । తీర్థాహ్వయభారతులకు దెల్పెను వారల్। ప్రార్థింప కృష్ణతీర్థుల। కర్థిన్ దయ జేసె తత్త్వమస్యార్థంబుల్ ॥ శా ॥ విద్యారణ్యమునీంద్రు డాగురుని చే విజ్ఞానమున్ గాంచి సం। వేద్యంబై శ్రుతిదివ్యభాష్యమొగి గావించెన్ బుధాహ్లాదసం। పాద్యంబమ్ముని జేయు సత్కృతికి నామంబొప్పె భూమిస్థలిన్ విద్యారణ్యమనం గతన్మహిమమున్ విఖ్యాతమై యెల్లగన్ ॥ సీ ॥ దెలిపె విద్యారణ్య దేశికుండు నృశింహభారతికమ్ముని పతి సురేంద్ర । భారతికా యతిపాలుడు శంకరభారతికా యమిప్రవరు డర్థి । నరశింహభారతి గురునకు నమ్ముని పతి సచ్చిదానందభారతులకు । కరమమ్మహర్షి శంకరభారతులకు నా ప్రౌఢవిద్యారణ్యభారతులకు। పరముడమ్మేటి నరశింహభారతులకు । వారు శంకరనామకభారతులకు । సచ్చిదానందభారతీస్వామి కత్త । పస్వియిచ్చెను గురుపరంపరగ ధరణి ॥ సీ ॥ వారువిద్యారణ్యభారతీంద్రులకు నాధీరుండు శంకరభారతులకు । నాగురుచే సచ్చిదానందభారతులమ్మునివర్యుకటాక్షమునస । దానందభారతికా ముని శంకరభారతీంద్రునకు నాపరమగురుడు । ప్రకటించెనరశింహభారతికమ్మేటి పలికె విద్యారణ్యభారతులకు । నాయతీంద్రుడు కరపె విద్యానృశింహ । భారతులకు సదానందభారతీంద్రు। డమ్మహామహుచే గాంచె నట్టి తపసి। శంకరాహ్వానభారతీస్వామికిడియె ॥ క ॥ యభవసమానుం డగ్గురు। డభినవశంకరసమాఖ్యులగు మౌనులకా। విభవమిడెనయ్యతీంద్రుం। డభియాతిమతాటవీదవాగ్నియనంగన్ ॥ గీ ॥ ధీరుడమ్మేటి యుద్దండ నారశింహ। భారతులకిచ్చె నాప్రతిభవ్యకరుణ। నరసి విద్యాప్రవీణ శంకరసమాఖ్య । భారతీంద్రులకుపదేశపరచిరంత ॥ క ॥ ఆయమితిలకము సద్గుణ । ధీయుత నరశింహభారతియమికి తదభి। ప్రాయమిడెనమ్మునీంద్రుడు। పాయని కృప శంకరాహ్వభారతులకిడెన్ ॥ గీ ॥ అట్టిశంకరయమివిరూపాక్షమండు। నిలువనపవర్గపదవి సన్నిహితమైన। గతియుదలపోసి యమ్మహాకారణార్థ । మాత్మశిష్యునకివ్వగానాత్మదలచి ॥ క ॥ యమలుడు విద్యారణ్యా । ఖ్యమునులకుపదేశమొసగి క్రమ్మర భువిన। య

మిజీవించుటగనిశీ। ష్యమణీంద్రుఁడుచింతజేయశంకరుఁడనియోన్ ॥ గీ ॥ తంద్రిమాకుపునర్జీవదశ
ఘటించె। చంద్రమౌళినిగైకొనిసంచరింప। నేగుపరదేశమునకీవునిందునిల్వ। వలదుమాకపవర్గం
బుగలుగువరకు ॥ క ॥ అనవినివిద్యారణ్యులు। మనమునసుప్పొంగిచంద్రమౌళీశ్వరుగై। కొనిని
జపీఠమునందిడి। జనియెన్ గురుశాసనమునజనములుమెచ్చన్ ॥ క ॥ అంతటకొన్నిదినంబుల ।
కంతేవాసులనుగూడియాశంకరుఁడ । త్యంతాప్తిసంచరింపగ । శాంతతకర్ణాటదేశజనపదముల
కున్ ॥ క ॥ జనికప్పట్రాళ్లపురం। బునపరమునిజెందుగురునిపొడగనిదుర్వా। ర్తనులెల్లగూడిశాం
బర। మునినుంచిరికపటపీఠమునకధిపతిగాన్ ॥ క ॥ ఆరీతికృత్రిమమువి । ద్యారణ్యులుపక్షికుల
నగనాలించిచమ। త్కారతవారలొనర్చిన । వైరుధ్యంబడపవేగవచ్చెనచటికిన్ ॥ క ॥ తత్కా
పటవృత్తినారసితక్షణమున। ఖండనముజేయమందాక్షకలితులగుచు। చరణములవ్రాలియంజలిస
లిపిమిగుల । వేడుకొననంతకర్నాటవిషయమిడిరె ॥ క ॥ ఆద్యులుశంకరశిష్యులు । విద్యార
ణ్యాహ్వాతత్వవేద్యులుకరుణా। పాద్యులుజనుదెంచిరిని। ర్భేద్యమతిన్ తూర్పుదెసకుప్రియమొప్పం
గన్ ॥ మ ॥ తరుణార్కప్రతిమానతేజుఁడగువిద్యారణ్యమౌనీంద్రుఁడ। త్తరిగాంచెన్బకహంసము
ఖ్యపతగధ్వానప్రకాశోర్మికా। మరుదంకూరపినాకినీతటనిలింపస్వామివాసోపమ। స్థిరసంపత్కా
రపుష్పశైలనగరీశ్రీకంఠసంస్థానమున్ ॥ చ ॥ కమలజవిష్ణుశంకరనికాయ్యముకాశిగయాప్ర
యాగతు । ల్యమమహనీయతీర్థగణలాలితమైనపినాకినీతట । స్థమఁపురమింతుమామకసుధాకర
మౌళినివాసయోగ్యమీ । క్షమనుమదీయపీఠముభృశంబుగనిల్పెదగాకవేడుకన్ ॥ క ॥ పరికిం
పపుష్పగిరివర। పురమాకైలాసతుల్యపుటభేదనమం। చరయుచువిద్యారణ్యులు। స్థిరమతినిజపీఠ
మచటజేర్చెముదమునన్ ॥ గీ ॥ చంద్రమౌళీశ్వరావాససదనమొకటి । కల్పనముజేసిగురువర
కల్పభూజ। మఖిలజనములకానందమావహిల్ల। నిలచెనపవర్గమార్గంబుదెలుపుటకును ॥ క ॥ ఆ
విద్యారణ్యగురు। ప్రావిణ్యులువైద్యపతికపర్దికిసరియై। సేవకవితానములనతి। పావనులనుజేసె
మోక్షపథమిడికరుణన్ ॥ క ॥ ధీరుండాయమితత్వవి। చారంబుపదేశమొసగెశంకరగురురా ।
డ్భారతులకయ్యతీంద్రుఁడు । కారుణ్యతనైజభక్తగణములనేలెన్ ॥ గీ ॥ నయతశంకరులుద్దండ
నారశింహ । భారతులకారహస్యంబుబయలుపరచె । నమ్మహామహుడఖిలవిద్యాప్రవీణు । డస
గనులిగాంచెసర్వంసహాంతరమున ॥ మ ॥ ఘనులుద్దండనృశింహభారతులుయోగప్రాజ్ఞులైసర్వ
శా । స్త్రనిరూఢత్వముతేజరిల్లగమహాస్థానంబులన్ జూచువే । ట్కనుశేషాద్రికినేగవైష్ణవులతో
డన్ గొంతవాదైనసం । దునవారిన్విజయంబుజేసెపరవాదుల్క్షితిలోదాగగన్ ॥ గీ ॥ నమ్మహాత్ము
లువెంకటేశావలోక। నంబుసేయగభూమీధరంబుమీది । కాత్మపల్యంకికారూఢులగుచుబోవ ।

ధర్మహీనత వైష్ణవతతులు జేరి ॥ క ॥ దురహంకృతి నద్దేశిక। వరు విభవము బూడ లేక పల్యంకిక మొ। త్తిరి రాలకట్టి యలతో। విరుగంగా గాంచి కోపవిహ్వాలులగుచున్ ॥ గీ॥ ధీరులుద్దండ నరశింహ భారతీంద్రు। లతులకోపదవానలంబావహిల్ల। నచట నిలచి పరాత్పరులగుచు వెలయు। చంద్రమౌళీశ్వరులనాత్మ సంస్తుతించి ॥ క ॥ మరిచములు చంద్రమౌళీ। శ్వరునకు నైవేద్యమిచ్చి సంయమివరులా। మరిచాహారత రిపుభీ। కరతపమొనరించె నగ్నికణికలు రాలన్ ॥ గీ ॥ తత్తపోవహ్నికీలావితానమునను। కరము శ్రీవెంకటేశ్వరు కళలుదరిగి। శేషమొక్కటిని ల్చె నీషితితలమున। ప్రతిపదింపక శారీతిభావమొప్ప ॥ చ ॥ వెలవెలబోయి వైష్ణవులు విశ్వగురూత్తములైన సంయమీం। ద్రులకును మస్కరించి భయదుష్ఖములుప్పతిలన్ మహాపరా। ధులము మహాత్మ తప్పులను ద్రోచి దయామతి మమ్ము బ్రోవగా। దలపుమటంచు వేడుకొనతన్నుతి గైకొని శాంతచిత్తులై ॥ గీ ॥ హితవు మీరంగ శ్రీవెంకటేశ్వరునకు। కళలు గల్పింపముండటికరణి వైష్ణ। వులు మహామోదమొప్పనందలములోన। నునచి నరృశింహభారతీ మునివరులను ॥క॥ శ్రీసరసిజాక్షుగుడికి। న్మోసేరి వైష్ణవులు వైరములు మాని మహా। ల్లాసత నారాయణ సము। లీ సంయములనుచు మిగుల హితమొప్పంగన్ ॥క॥ జలజభవ సదృశులగువా। రలుముదమున వెంకటేశ్వర స్వామిపదం। బులు బూజ జేసి శేషా। చలమున్ దిగి స్వేచ్ఛతోడ జనిజని యెదుటన్ ॥ గీ ॥ గనిరి శ్రీజన్నవాడ నాకటకమందు। దనరు కామాక్షి నచటయం త్రంబు వేశి। యతులమహానంది శైలఘాలాక్షు గాంచి। నన్మహాస్థానమున గురుడధివసించి ॥క॥ మోహనయంత్రంబచ్చట। సాహసమున నిలిపి కదలి సంతతసూరి। వ్యూహములు ప్పొంగగస। స్నేహంబున జనిరి గురులు శ్రీనగమునకున్ ॥ గీ ॥ భ్రామరీమల్లికార్జున భవనమందు। తపము గావింప నచ్చటిన్నృపతితతులు। వేడుకొన్నంత గైకొనె విమలమూర్తి। ధర్మకర్తృత్వ వైభవదశను కూర్మి ॥ గీ ॥ భవ్యులుద్దండ నరశింహభారతీంద్రు। లైక్యకాలంబు డాయుటనాత్మ దెలసి। యన్మహాత్ముడు శంకరాహ్వాయ గురునకు। పరమకృపతోడనుపదేశపరచిరంత ॥ క ॥ కూరిమి శంకరముని గడి। యారముపంశీయవటు నియతివరులుగను। ద్ధారమొనరించి శంకర। భారతులపవర్గపదము బట్టిన పిదపన్ ॥ క ॥ పరతత్వవేది యయ్యతి। తిరముగ నరశింహభారతీస్వాములనా। బరగి నిగమాగమాంత। స్ఫురణత దీపించె తననుబుధులెన్నుకొనన్ ॥సీ॥ ధరజగద్గురువృత్తి దాల్చుటయే కాదు గురుడు సద్వ్యవహారకుశలమందు। బ్రహ్మోగమాభ్యాసపాటవం బేకాదు బ్రహ్మపరిజ్ఞానభాషణముల। నారాయణస్మరణయే కాదు రెండవ నారాయణుండరిదారవిధుల। ధర్మశాస్త్రోక్తయత్తదశ జెందుటయే కాదు ధర్మ్యాచారసంస్థాపనమున। గాన సీదేశికుడె మోక్షకర్తయనుచు। సకలపండితనిచయంబు సంస్తుతింప। భాసురాద్వైతమార్గ మేర్పడగ జేసె। రసను విద్యానృశింహభారతి గురుండు ॥ గీ ॥

ఆగురుడుదేవభావంబునంటువేళ। వ్యాసమునితుల్యనందేలవంశవటున। కాత్మపూజితచంద్రమౌ
శ్యభవునాత్ర। మంబొనగిపూర్ణయోగసమాధిజెందె ॥ క ॥ నరశింహభారతీగురు। వరశిష్యుండ
ఘహరుండవారితముక్త్యా।భరణంబనవిద్యాశం। కరభారతిగురుడువెలసెకరకంతుక్రియన్ ॥ సీ ॥
తాల్పడేబ్రహ్మవిద్యావిచారంబాత్మనిశ్చలభావంబునెగడజేసి । గాల్పడేకామాదిఘూసగుల్మంబు
లయోగకృశానుసంయోగములను । గూల్పడేతాపత్రయాల్పభూజంబులధీరతపోరుకుఠారధా
ర । దెల్పడేజీవైక్యదివ్యవిద్యాబోధనిజపాదసేవకనివహములకు। ధరణిదుర్వాదమడచియద్వైత
మతము । నిల్పడేసర్వరాజధానీసభలను । ఘనయశుండత్తపోనిధికలుషశైల। కులిశతుల్యుం
డుశంకరగురువరుండు ॥ క ॥ కూరిమివిద్యాశంకర।భారతులనుచరులగూడిపటుగతికృష్ణా।
తీరజగతీసతీమణి । హారంబగుకస్తలాగ్రహారముజేరెన్ ॥ గీ ॥ పరమగురుడగుశంకరభారతి
యతి । తమకుదేహపరిత్యాగదశసమీప । మగుటమదిగాంచియోచించియాత్మధర్మ । కధిపు
సేయగసద్వటునరయువేళ ॥ ఉ ॥ నీరజసంభవున్మదితృణీకరుగాదలపోసిసర్గసం । స్కారచ
మత్క్రియానిపుణస్రష్టయసంగత్రిశంకుమేనుతో । సారపురంబుజేర్చిసరిసంయములద్భుతమం
దపాపసం । హారుడుమించెకౌశికమహర్షివరుండుజగత్ప్రసిద్ధిగన్ ॥ క ॥ ఆయమిగోత్రమ్మున
నిర । పాయయశోభాగధేయభాసురులైస్వా । ధ్యాయపరాయణులైబుధ । గేయతమించిరివ
దాన్యకృత్యంబులచేన్ ॥ క ॥ వారలుపూర్వముచెప్పలి । పూరధివాసంబుసేయభూమిస్థలిత ।
త్కారణతగలిగెచెప్పలి । వారనితత్పూరులకునువాడికగాగన్ ॥ సీ ॥ కాణాదమీమాంసపా
ణినీయప్రముఖోల్లసన్మతులుచెప్పల్లివారు । నిఖిలాధ్వరక్రియానిపుణతసురహవిర్భాగదాయకు
లుచెప్పల్లివారు । సకలదీనానాథసంరక్షణోపాయభారవాహకులుచెప్పల్లివారు । యమనియ
మాదియోగాభ్యాసభాసురబ్రహ్మవాదకులుచెప్పల్లివారు । వైభవవదాన్యసౌశీల్యవంశములను ।
పటిమగాంచినవారుచెప్పల్లివార । లట్టిసత్కులవార్ధిసుధాంశుడగుచు । నవతరించెనుబసవయా
హ్వానఘనుడు ॥ సీ ॥ నిజధర్మపద్ధతినియతిదప్పకనధ్వరంబులుజేసియన్నంబువెట్టి । ననుపమ
భూతిశివాలయంబొనరించిధీరతలింగప్రతిష్ఠసేయ । నతిథిపూజావిధిననవరతముబలిహరణాది
కృత్యములాచరింప । శయ్యాచమత్కారశబ్దవృత్త్యర్థప్రబంధనిర్మాణకపటిమబ్రోవ । భువినిక
ల్పమహీజమీపుణ్యుడనుచు. । సజ్జనంబులుమనమునసంతసింప । భవ్యకౌశికగోత్రచెప్పల్లికుల
జ. । బసవయాహ్వాయభూసురప్రవరుడలరె ॥ గీ ॥ అట్టిబసవాహ్వాయుడువారణాశివంశ।శేష
యతనూభవనునయశీలసుగుణ । సహితవెంకటలక్ష్మమ్మసాధ్వినమిత । హర్షముప్పొంగపరిణ
యమయ్యెకూర్మి ॥ సీ ॥ పతియెదబ్రాక్కనిపద్మావధూటికబహుజనంబులనోళ్లబడనివాణి ।

భర్తలోఁ సగఁబాలు బంచ నేరని సతివరు బాసిపోవని ధరణితనయ । పనిగల్గి యొక్కరి పంచఁ జేరని రతితన విభుఁ బొంకించి జనని సాక్షి । యొరులు వ్రేళ్లను జూపకుండు నరుంధతి పంకసంకుల గానిపం టువలతి । యారసాధ్వీవతంసమీ హరిణనయన । యనఁగ నుతిగాంచె ధవుని సేవాభిరతిని । విభవసద్గుణ సౌశీల్య విమలకీర్తి । లక్షణకదంబ వెంకటలక్ష్మమాంబ ॥ క ॥ వ్యాసోపమ బసవయప్ర । ధీసురకులభూషణుండు వెంకటలక్ష్మాం । బా సాధ్వియందు నిత్యో । ల్లాసంబున ముగురపుత్రుల గాంచె ధరన్ ॥ గీ ॥ జ్యేష్ఠుఁడై మించె లక్ష్మీనృశింహశాస్త్రి । మధ్యముఁడు నాగరమణయ్యమాన్యచరితు । డఖిలనిగమాంతసారరహస్యవేత్త । వెంకటాచల తాపస విభవశాలి ॥ క ॥ ఆముప్వురకగ్రజుఁడై । భూమిని లక్ష్మీనృశింహపుణ్యుఁడు విద్యా । ధాముఁడు రూపవినిర్జిత । కాముఁడు విలసిల్లె విబుధగణములు వొగడన్ ॥ ఉ ॥ మానితకీర్తిశాలి సుకుమార సుమేషుసమానుఁడైన ల । క్ష్మీనరశింహశాస్త్రి యలవిశేషవదాన్యత కోడి సిగ్గుతోఁ । గానల డాగెఁ బూరిగొ నెకల్పకదైవతధేనువుల్ క్షయ । గ్లానివహించె చంద్రుఁడు నగంబులనం బెపయోదమాలికల్ ॥ శా ॥ ఆలక్ష్మీనరశింహసోదరుఁడు మిథ్యావాదివంశాటవీ । జ్వాలాభీలదవానలుం డఖిలశాస్త్రజ్ఞానపారీణవా । ఛాళుండార్తదయాళుఁ డర్థిదివిజక్ష్మాజంబ నామించెలో । కాలోకాంతధరాస్థలిన్ రమణయాఖ్యానుండు కీర్త్యున్నతిన్ ॥ సీ ॥ వ్యాపింపఁ దాయ నేవ్యాఘ్రభూసురారాతి కంఠకాళిమ ముశుక్లంబుగాఁగ । స్థాపింపఁదాయ నే శతకోటి శుభ్రాంశుమండలప్రభల వేథోండమునను । దీపింపఁ జేయ దే దివ్యగంగోర్మికా సంజాతకమల హంసవ్రజముల । జూపింప దే తనశుచివృత్తి శారదాధమ్మిల్లమునను గేదంగి రీతి । వెలసెప దునాల్గు భువనముల్ విశదముగను । వెండి జలపోతఁ బోసిన విధము దోప । భాసురౌదార్యవిభవ చెప్పల్లికులజ । రమణయాహ్వయకీర్తి పాండిమ గభస్తి ॥ గీ ॥ సత్త్వవృత్తిన వెంకటాచల మహాత్ము । డాత్మ విజ్ఞానవృత్తి జెన్నారు టూరుల । కెరుకఁ బడకుండ మౌనతనిమిడియుండె । బూది పైఁగప్పఁ బొను జాతవేదుకరణి ॥ క ॥ తనయులు ముప్వురు బసవయ । పనుపడఁ గాఁ పల్లురాళ్ల పల్లియపురమం । దునకాపురంబు జేసెను । వనజాక్షశివాంఘ్రిభక్తివశుఁడై కూర్మిన్ ॥ ఉ ॥ ఆమహనీయుఁ డా రమణయాఖ్య సుధీమణి వెంకటాచల । స్వామిని వెంట దోడుకొని శంకరదేశికులుండు కస్తల । గ్రామము జేరఁగా జనియె కాలవశంబున భావిమంగళ । స్తోమము డాయగా లోలగ్రోయ సమర్థముగల్గి దేరికిన్ ॥ క ॥ విన్నాణంబి గురూత్తగ । సన్నుతి వందనమొనర్చ శంకరయములా । పన్నుల వారల తగ తమ । సన్నిధిలోను నిచిమిగులసంభావింపన్ ॥ క ॥ సుతవరులు బసవయాహ్వాయు । డతివినయత శంకరార్యయతిమణికరుణా । న్వితులై సజ్జనసముదయ । హితులై వర్తిల్లుచుండు నెడమహిమమునన్ ॥ గీ ॥ స్ఫటికకుంభస్థదీపితజ్వలనురీతి । నాత్మలో బ్రహ్మతేజంబు నంటి వెల్గ । వెంక

టాచలనామత వెలయుబసవ । యాత్మజునిజూచిశంకరయతివరుండు ॥క॥ యీమాణవకవతం
సము । మాపకపీఠమునకర్హమాణుండనిని । త్యామోదకలితమానస । తామరసంబొప్పమిగు
లదలపోసికృపన్ ॥క॥ బసవయకనిష్టసుతును। ల్లసితయశుని వెంకటాచలవటునికరుణా। రసము
నశంకరయతిమణి। లసదృశనిజపీఠమునకునధిపతిసేయన్ ॥ గీ ॥ దలచిడాయంగబిలచియత్తాప
సేంద్రు । డావటునకిట్టులనియె నేకాంతమందు । చంద్రమౌళీశ్వరాస్థానసంయమీంద్ర । భా
వమునన్నిన్నునిల్పమాభావమొప్పె ॥గీ॥ ననిబోధించియొడంబడ। గనుజేసితదీయజనకుగనుగొని
యుష్మ । త్తనయునిమాపీఠంబున। కనఘాసీవొసగుమనగననుకూలమునన్ ॥క॥ బసవయ్యాగా
రొసంగిన। భిసరుహగర్భోపమానపృథుకునియతిగా। నుసమర్థపరచిశంకరు। లసదృశకైవల్యాప
దవికరిగినపిదపన్ ॥ క ॥ కొందరుమఠసంవాసులు । మందాతువిఘూర్ణమానమానసులగుచా ।
నందంబువిడచివగలన్ । బెందితదాశ్రమపువిధులుజేసినమీదన్ ॥గీ॥ పరమగురుడగుశంకరభా
రతీంద్ర। హస్తసంజాతజన్మవిద్యానృశింహ। భారతీంద్రులుగురురాజ్యభారమూన। జూడజాలకశ
త్రులసూయమొంది ॥క॥ శాంబరతంత్రంబులత। మ్మున్బరిమార్పంగదలచుమోసంబులనం। తంబు
లుగనిదేశికశిం। హంబొగిచెప్పల్లిబనవయాఖ్యునకనియెన్ ॥క॥ శ్రీమద్విద్వత్సభలను । ప్రామి
నుకులస్వరముద్ధృతబల్కుటచేత । ధీమతులకవనిలోగృహ । నామముసుస్వరమువారనాప్రభ
వించెన్ ॥చ॥ కుతలమునన్రథీతరసగోత్రపవిత్రులుసుస్వరాన్వయా। న్వితులువివేకులందువిధి
వేద్యుడుమాన్యుడువెంకటప్పగా। రతులవిభూతిమూర్తిమసమాఖ్యనుబంధుహితంబుగాగన। చ్చ
తురుడుబెండ్లియాడిసుతసంపదగాంచెమహానురాగతన్ ॥ గీ ॥ యార్యనారాయణప్పసమాఖ్య
సూరి । వెంకటాచలవేత్తరవిప్రభావి । రాజమానుడువెంకటరామశాస్త్రి । కృష్ణసుబ్బాహ్వ
యులగాంచెకీర్తిమించి ॥ క ॥ ఆమాన్యులలో వెంకట । రామవిపశ్చిద్వరుండురాఘవమ్మనుప ।
త్తామరసమధుకరాయిత। ధీమహితుండరతమోష్ణదీధితివెలయన్ ॥క॥ విలిపింపుడమ్మహాత్ముడు ।
గలుగంగామీకుకార్యఘటనకుకొదవా । దలపోయుడనిన వైభవ । మలవడబసవయ్యపరమహ
ర్షముతోడన్ ॥క॥ తనభటునిగోపవరపుర । మునకంపినవార్తవెలసిమోదంబునపా । వనుడ
గువెంకటరామయ । మనుజవరేణ్యుండుశత్రుమండలినడపన్ ॥ క ॥ జనిసన్నిధిలోవలిదు ।
ర్మనుజులగర్వంబడంచిమహిమమమీరం। గనుదోడితెచ్చెవేడుక। జననీవందనముసేయశంకరగు
రులన్ ॥గీ॥ మాతృవందనమొనరించుమానివర్యు । సన్నిధిననుండిసిరిమించుశాస్త్రియశము ।
తమకుకొరగామికపటకృత్యములుసేయు । పరులనుజయింపగాబూనిభావమునను ॥ సీ ॥
యగ్రజబలయుతుడయ్యెదుర్విషపయోజేక్షణాతదీపించిచిత్రవృత్తి। గోవర్ధనోద్ధారకోవిదత్వమున

రాజవ్యవహారరంజనకుమించి। విజయసారథినాగవిక్రాంతశీలుడై నిజమంత్రశక్తిసన్నిధి వెలుఁగ। ఖలకర్ణశల్యముఖవికసనంబడగించి సకలబంధూత్తముల్సంతసింప। గురుసభాపీఠమునధర్మకుశలసుగుణ। రంజితార్యనృసింహభారతులనిలిపె। నారదలపోయరెండవశౌరిరీతి। రసనునుతికెక్కె వెంకటరామసూరి॥ ఉ॥ ఆనతవైరిసద్గుణపయోంబుధి వెంకటరామయార్యువి। ద్యానరశింహభారతులుదారతమంత్రిగజేసియాత్మసం। స్థానము వైభవోజ్వలపథంబునవర్తిలతానుశిష్యసం। తానముధర్మకౌశలవిధానతనుండగనేలెసత్కృపన్ ॥ సీ॥ ఖండపాషండాగశంబధారలు బౌద్ధసారంగరాజికంఠీరవములు ; చార్వాకవారిదజంఝూసమీరముల్ జినమతవనదావశిఖిసదృశులు। నిఖిలధర్మాధర్మనిపుణచతుర్ముఖులద్వైతఫలదసురావనిజము। లతులశివైక్యయోగాభ్యాసనిరతులుప.ణ్మతస్థాపనాచార్యమణులు। వితతవిద్యానృసింహభారతియతీంద్రు। లధివసించిరికూర్మిపుష్పాద్రిముఖ్య। మనిమనంబునదలచిసత్యముగనిచట। ధరణినాచంద్రతారకాస్థాయికముగ ॥ క॥ గావునననీక్షేత్రముసరి। రావుమహాస్థళములిలకరముగోపురమున్। గావింపదలచినాడవు। నీవిక్కాలమునధర్మనిపుణుడవనఘా ॥ క॥ అనితిరుమలార్యమణిబలి। కినవినివేడుకనుచెన్నకేశవమూర్తిన్। గొనియాడితత్ప్రసాదముగొని వైశ్యనిజూచిబల్కెగురుధైర్యమునన్ ॥క॥ ధనవంతులునెరిసుకృతపు। పనులనుగావింతురనుచుబల్కెదరైనన్। పనిబూనెదనెరవేర్పగ। కనకవసానుండుమనకుగలడనిజెప్పన్ ॥క॥ వినిమిట్టాసుబ్బయజె। ప్పెనునీసాహసపు పూర్వపృథుకార్యములన్। బనుపడసేయదెహితముగ। ననఘాకట్టింపునీకుహారిగలడుగదా॥ సీ॥ సేయింపలేదెఖాజీపేటరోడ్డుమార్గము పనికమలాపురంబుదనుక। వేయించవేచోరవితతులసరకారుకారాగృహములశిక్షలనుతొల్లి। మాయింపవేశత్రుమండలికీర్తులస్వప్రతాపానలజ్వాలికలను। వ్రాయింపవేవిప్రవర్గంబులకుభూమిదానపత్రములుయథావిధిగను। పార్లమేంటుసభాస్థసభాసదులను। రాజకార్యతమెప్పించిరాణిగారి। కూర్మివలయంబుగొనునీకుగోపురంబుకృత్యమననెంత వెంకటరెడ్డిసుగుణి ॥క॥ గావుననుచెన్నకేశవ। దేవుకృపారసమువలనదేవరవార। ల్గావించుపుణ్యకార్యము। శ్రీవెలయనుమీరుబూనిసేయింపుడనన్ ॥ఉ॥ వెంకటరెడ్డిసంతసిలివిశ్వముమెచ్చగనాత్మభక్తితో। శంకరవిష్ణుగేహములసాలముముందరగోపురంబున। భ్రూంకషమైజెలంగతనభాగ్యముదేవునకర్పితంబుగా। శంకలుమానికల్పనభృశంబుగజేసెజగత్ప్రసిద్ధిగాన్ ॥ వ॥ యిట్లుసర్వజనానందకరంబుగాగోపురంబునిర్మించియపుణ్యస్థానంబునహరిహరులసేవింపుచుండనద్ధర్మప్రభావంబవనిజనాలాపంబులవలనదిగంతవ్యాప్తంబగుటయు ॥గీ॥ కడపయనుపట్టణంబునఘనులుకమిటి। వారలిప్పుణ్యకథవినిగౌరవమున। గోపురముపుష్పగిరిగనుగొనెడి

వేడ్క । నరుగుదెంచిరిసంతోషమావహిల్ల ॥ వారెవ్వరంటేని ॥ ఉ ॥ శ్రీవనజాసనాన్వయ
ధురీణులుసభ్యులుచౌడమాంబికా । సేవకులార్యసమ్మతులుశిష్టులునందవరీకులందుసం । భా
వితకీర్తిశాలురుపమన్యువసిష్ఠసగోత్రమంత్రవి । ద్యావిదులర్థిపోషణసురావనిజాతములై జగం
బులన్ ॥ గీ ॥ కొమరగిరివారలనగతత్కులపయోధి । కువలయాప్తుండుజనియించెకుజన
మత్త । సింధురసమూహవిదళనసింహుడగుచు । సుబ్బరాయసమాఖ్యుడుసుజనహితుడు ॥
క ॥కొమరగిరిసుబ్బరాయుని। విమలయశోవిభవపూర్ణవిధుచంద్రికలు । త్తమగతిద్రుహిణాం
డంబున । తమమున్ ఖండించినైజధవళిమనిలిపెన్ ॥ చ ॥ వెలవెలబోడుస్రుక్కిపృథివీభరపాద
ములంటడాత్మలో । గలవిషముప్పతిల్లగముఖంబుననైల్యముబూనిభూమిపం। కిలతవహింపసీడుబ
రికింపగజీవనమిచ్చువేళలో । జలదముసాటిరాగలదెసద్గుణసుబ్బయమంత్రిమౌళికిన్ ॥ క ॥ కొ
మరగిరిసుబ్బయాగ్రణి। కమలాసమనరసమాఖ్యకాంతనుబంధూ। త్తములనుతింపగసంప। త్ప్ర
మదంబిగురింపకూర్మిపరిణయమయ్యెన్ ॥ క ॥ పతిదేవతయైతగుత । త్సతియందునసుబ్బరాయ
సచివాగ్రణిసం । తతవైభవోన్నతుండగు । సుతుగనియెన్ సూరయాఖ్యశుభచారిత్రున్ ॥
ఉ॥ మానమునన్ సుయోధనసమానుడుదానమొసంగిగావకా। నీనునిసాటిభాగ్యమునసీరజలో
చనుడార్యకార్యవి । జ్ఞానములన్ బృహస్పతియనన్ దగుసూరయమంత్రిదివ్యసం । తానమహీరు
హంబువిబుధప్రతతిన్ కృపజూడధారుణిన్ ॥క॥ ఘనయశుడుసూరయాహ్వయు । డనురాగము
మీరలక్ష్మమాఖ్యనుపెండ్లా। డెనుమదనుడురతిసంగతి।వినయంబుప్పొంగబంధువితతులుమెచ్చన్॥
సీ ॥ అఖిలవిద్వత్ప్రియస్వాంతరాజితగానవాగ్వధూతిలకమీవనజగంధి । వైభవసంపద్వివర్ధన
గావునలోకైకమాతయీలోలనేత్రి । కల్యాణసౌభాగ్యకమనీయగావుననార్యావధూటియీ
యబ్జవదన । దీనార్థిరక్షణాధీనమానసగాననసూయగానోపునలరుబోణి । యనుచుజగములు
బొగడనిత్యానురక్తి । పతికిశుశ్రూషలొనరించిభక్తివశత । దనరిసాధ్వీవతంసపథంబుగాంచె ।
ఘనయశోద్దామలక్ష్మ్యంబికాలలామ ॥ క ॥ సూరయ్యలక్ష్మమాంబాం। భోరుహముఖియందుగాం
చెపుత్రులవంశో । ద్ధారులసుబ్బయశేషయ । ధీరులనిజదీప్తివిజితదినమణులధరన్ ॥ ఉ ॥ అగ్రజు
డార్యసమ్మతుడహస్కరతేజుడుసుబ్బరాయమం। త్ర్యగ్రణిదానకందమునలార్కతనూజశిబిప్రభా
వమే । కాగ్రతనావహించిభువనాంతరసుస్థితదీనచాతకా । వగ్రహముల్ దొలంగగసువర్ణము
లన్ గురియున్మహోన్నతిన్ ॥ తదనుజుండు ॥సీ॥ కరుణాపయోనిధిగాకున్నతనలోనసద్గుణమ
ణులెట్లుసంభవించు । కాలజీవనదముగాడేనియేవేళనర్థిచాతకములెట్లనుసరించు । నిరుపమస
త్కళానిధితానుగాకున్నకీర్తిచంద్రికలునేక్రియఘటించు । మిత్రస్వభావధర్మత్రాతగాడేనితేజః

ప్రకాండమే తెరగుమించు। గానగంభీరవారిధిఘనుడుపూర్ణ । సత్కళానిధిమిత్రుడీసరసుడను
చు। పండితోత్తములెన్నగాఁబ్రబలెసుజన । జలజవనహేళిశేషయసచివమౌళి ॥ మరియు ॥ క ॥
శ్రీతామరసభవోరూ। ద్భూతంబైబహుళవిభవపూర్ణంబైవి । ఖ్యాతిగలవైశ్యవంశము । భూతల
మునబాగడనెగడెపూతయశమునన్ ॥ గీ ॥ అందుకృష్ణమువారననాఖ్యగలిగి । పడిగెశిలగోత్ర
జులుసిరుల్ప్రబలివంశ । వర్ధనులునివసించిరవార్యకీర్తి । పరులువల్లూరునామకపురవరమున ॥ గీ ॥
అట్టికృష్ణమువంశపయోబ్ధిలోన। పూర్ణజైవాతృకునిరీతిబొడమిపుడమి । వెలసెబాంధవజనకైర
వప్రతాన । మలరవెంకటనారాయణప్పశెట్టి ॥ గీ ॥ అతనియర్ధాంగలక్ష్మిపాపమ్మవిభవ ।
సంతతులమించిదీనార్థిసముదయముల । పరమభక్తినిరక్షించిపతికిసేవ । లనుదినముసేయుప
తిదేవతాభిరామ ॥ క ॥ ఆరసికదంపతులుసిరి । గోరికుమారప్పనాముగోవిందాఖ్యున్ ।
సూరయ్యనాగముపురుకు । మారులగనిరభవభక్తిమహిమాన్వితులన్ ॥ ఉ ॥వారలకగ్రజాతుడ
నివారితదానచణానుకూలమం । దారమహీరుహంబగుబుధస్తవనీయకుమారయాఖ్యుడం । భో
రుహసంభవాండపరిపూర్ణయశోనిధివిప్రపోషణా । ధారమనస్కుడైప్రబలెధర్మనిధానముభూ
తలంబునన్ ॥ శా ॥అవ్వైశ్యాగ్రణితమ్ముడార్యబుధనిత్యానందసంధాయియై । దేవాధీశ్వరభో
గభాగ్యనిధియైదివ్యావ్యయావాసభూ । శ్రీవిఖ్యాతకమైవెలుంగనిలలోఁచిత్రఁబెదీనాళికిన్ ।
గోవిందాహ్వయకల్పభూమిరుహముల్గోరర్థముల్గూర్చుటల్ ॥ క ॥ తదనుజుండు ॥ సీ ॥
పుణ్యజనేశతబొందిననిధినాథుడైనగుహ్యకభర్తయగుటలేదె । శ్రీపతియయ్యురక్షించుజగంబ
న్నపరహిరణ్యహరాఖ్యబాలుపడదె । లక్ష్మీసహజతకళానిధియైనశశాంకసంజ్ఞతనుకళంకిగాడె।
కనకాద్రిపిడికిటగలిగిననణిమాదులబ్బిదిక్పటితబిష్టార్థిగాడె । గుహ్యకుండహీశయనుడుకుమ
దహితుడు । లుబ్ధుడనిరోసివారికల్మిలుకృపాప్తి । నితనిజెందెనౌనాగధనేశుడయ్యె । సూరయా
ఖ్యుడురుచిజితసూనశరుడు ॥ గీ ॥ ఇట్టితమ్ములుతనుగొల్వహితవుమీర । గనుకుమారప్పచెన్నమ్మ
కమలముఖిని । పరిణయంబయ్యెపుత్రవైభవముగోరి । సజ్జనులుబాంధవులుమదిసంతసింప ॥
ఉ ॥ మానితదానసంపదభిమానదయాగుణనాథభక్తివి । జ్ఞానములందుపద్మసదనాగిరిజాసమ
శీలగానియీ । మానవతీలలామలసమానలసేయగరాదుచెన్నమాం । బానలినాయతేక్షణకు
మానసమంమదలంచిచూచినన్ ॥ గీ ॥ అబ్ధిగంభీరుడగుకుమారప్పచెన్న । మాఖ్యసాధ్వీల
లామయందాత్మజులను । గనియెవెంకటసుబ్బయ్యఘనునిబాల । యాహ్వయునిదేవగురుభక్తిహ
ర్షమతుల ॥ అందగ్రజుండు ॥ సీ ॥ ధర్మువెరింగిమేధాశక్తిరాజసంస్థానకార్యంబులుచక్కసేయ।
సత్యవాక్యప్రతిష్ఠారక్తినిజపరజనులకానందంబుసంఘటింప । ననవరతేష్టకామ్యంబులర్థులకిచ్చివి

మలమహాసత్కీర్తి విస్తరింప। సతతకేశవపాదజలజసేవాస్ఫూర్తి భావవైరాగ్యంబుప్రబలసేయ। నలబృహస్పతిధర్మజుండమరభూజ। మంబరీషుండనగమించెనవనికృష్ణ। మాన్వయపయోధిపూర్ణసుధాకరుండు। దనరువెంకటసుబ్బయ్యధార్మికుండు ॥ ఉ ॥ తమ్మిబిడారునుండుచెలితమ్మునెదఁగలరంకుమాన్పమొ।త్తమ్మగుకీర్తిగైకొనినతమ్ముడుబాలయతానుభోగభా। గ్యమ్ములమించి సౌఖ్యములుగాంచినవెంకటసుబ్బయాహ్వయం। డిమ్మహిధర్మశీలుడనుచెంతురుపెద్దలనేకభంగులఁ ॥ గీ ॥ అవనికార్యదర్శియగుకొమరగిరికు। లోద్భవుండుశేషయోరుకీర్తి। విభవశాలియైనవెంకటసుబ్బయ్య। పుష్పగిరికివచ్చిపొలుపుమిగుల ॥ గీ ॥ చెన్నకేశవుబూజంచిసిరులమించు। గాలిగోపురవరమునుగాంచిదుగ్గి। రెడ్డికులజుండువెంకటరెడ్డిజేయు।పుణ్యకార్యంబునకుమెచ్చిపూజ్యులపుడు ॥వ॥ నిజోచితస్నానానుష్ఠానంబులుదీర్చుకునిసద్గుణనిధానంబగువెంకటరెడ్డిసమాహ్వానసహితంబుగాశ్రీమద్విద్యాశంకరార్యచంద్రమౌళీశ్వరాస్థానంబున। కరిగివందనాదులొనరించిజగద్గురువరానుమతంబుననిజోచితాసనంబులనుండుసమయంబున బ్రహ్మాండపురాణోక్తపుష్పాచలఖండంబొక్కవిద్వాంసుండు॥క॥శంకరదేశికుసన్నిధి।శంకరహరిమహిమవెలయసంస్కృతకృతిని।శ్శంకఁజదివితదర్థము।లంకరమనురక్తిదెలుపలాలిత్యముగఁ॥క॥వినిసభికులనిరివిద్వజ్జనముఖ్యులుగాకదెలియజాలరితరులీ। ఘనకావ్యముదెలిగించిన। మనుజులకందరికిసులభమైవిలసిల్లుఁ ॥ క॥ గోపురతుల్యంబీకృతి। దీపింపగసేయనెట్టిధీరులుగలరీ। వ్యాపారముసామాన్యము। గాపరికింపంగవలదుకఠినముసుమ్మీ ॥ గీ ॥ యనిప్రసంగోచితంబుగానాడినట్టి।పలుకులానందమొసగనప్పట్లదుగ్గి। రెడ్డివెంకటరెడ్డిధురీణుడాత్మ। దలచెనప్పనిజేయింపధార్మికుండు॥ గీ ॥సభికులందరుతమతమస్థానములకు। జనినపిమ్మటవెంకటసద్వివేకి। చిత్తమిగురింపగాసుంకేశిలకువచ్చి।తననికాయ్యములోననంతటవసింప॥ వ ॥అట్టిసమయంబున॥శా॥శ్రీరంజిల్లధరాస్థలంబుననుగౌరీనాథపాదార్చనా।పారానందహృదంతరుండువిబుధవ్రాతామృతాంశుండుగం।భీరుండార్తసురద్రుమంబనుచుసంప్రీతిఁప్రశంసింపగా।నారంవాయలుదేవనాయకమొదల్యారీంద్రుడొప్పుఁ ధరఁ ॥ సీ ॥ క్షమతపరోపకారమొనర్పగాసాటిశిబిచక్రవర్తినిజెప్పవచ్చు। ధర్మవిజ్ఞానసత్యముల సమంబుగాధర్మతనూభవుదలపవచ్చు। బహుళవిద్యాస్ఫూర్తిభాషాచమత్కృతినలబృహస్పతిసరియాడవచ్చు।సంతతసద్భక్తిశైవదీక్షాదులబసవేశ్వరుని సాటిబలుకవచ్చు। ననుచువిబుధులుతనుగొనియాడకీర్తి। మించిషోడశదానముల్బంచితొల్లి। దాతలనుబోలెనారయిధార్మికుండు। దేవనాయకమొదలిసద్వినయశాలి ॥ గీ ॥ దేవనాయకమొదలిసతీనిధాన। దీనసంతానముదితసుధీవితాన। యధిపసన్మానవిమలదయాభిమాన। హరపదాధీనసుందరాంబాభిధాన॥

ఉ॥ సర్వసుఖంబులన్ విమలసంపదలన్ విలసిల్లి యాత్మలో । గర్వము జెందబోదునిజకాంతునిదై
వముగా దలంపుచున్ । శర్వపదారవిందములసన్నుతిమానదొకప్పుడైనదా । నుర్వినిసుందరమ్మ
సరియొత్తురెచూడగమానవాంగనల్ ॥ క ॥ ఆదంపతులిలగాంచిరు । మాదైతునిభక్తుడగుకుమా
రస్వామిన్ । శ్రీదుసరియౌసభాపతి । నాదిమశైవులనుసద్గుణాంచితమతులన్ ॥శా॥ అరమ్యాత్మ
భవాగ్రజుండగుచునిత్యానందసంస్థాయియై । రారాజప్రతిమానవైభవకుమారస్వామినాగన్మో
ద । ల్యారింజెప్పగవచ్చుకణ్ణుడెవదాన్యప్రౌఢిమన్ సుందరా । కారంబందునకంతుతుల్యుడని
నిక్కంబెంతురార్యాగ్రణుల్ ॥ క ॥ శ్రీమహితుడగుకుమార । స్వామిమొదల్యారిసంతసంబునస
తిగా । కామించెనుభాగీరథి । నామనఖిలసుగుణనయనిధినిదగన్ ॥ తదనుజుండు ॥ సీ ॥ శ్రీశి
వానాథాంఘ్రిసేవానురక్తియెవ్వానిమానసమెడబాయకుండు । వసుదేశసభలనెవ్వానిమాధు
ర్యోక్తులధినాథకర్ణరసాయనములు । దీనసజ్జనులకెవ్వానివదాన్యమఖండేష్టకామదకల్పతరువు।
వాణిజ్యచాతురీవైఖరికెవ్వానిధైర్యంబుమేరుభూధరసమాన । మనుచుహలాణాధినాయకులట్టిఘ
నున । కిడిరిరావుబహద్దరుయేసభాప । తీంద్రసంజ్ఞకితాబునహీనఫణితి । ధరణినాచంద్రతార
కాస్థాయి-గాగ॥ గీ ॥ ఇందుమన్మథసుందరుండేసభాప । తీంద్రుడువరించెభార్యగానిందుముఖిని ।
సరసమాణిక్యమానాగసాధ్వీమణిని । పరమహర్షితజనములుప్రస్తుతింప ॥ శా ॥ ప్రాణేశాం
ఘ్రిసరోజయుగ్మభజనప్రాకామ్యతన్ దీనసం । త్రాణప్రాభవతన్ వదాన్యగుణచిత్తప్రౌఢిమన్
జూడగీ । ర్వాణాజ్ఞాతులుసాటిరారనగధర్మంబౌనెభూకాంతల । ల్మాణిక్యమ్మపతివ్రతామణికి
లన్ మారొడ్డగాసజ్జనుల్ ॥ గీ ॥ ఇట్టిరావుబహద్దరుయేసభాప । తిప్రభూత్తంసుడనురక్తినిష్ఠుడ
య్యె । పార్థుగనవచ్చుకృష్ణునిపగిదిసుగ్గి । రెడ్డివంశజువెంకటరెడ్డికడకు ॥ క ॥ వరుదేరగాం
చిసంతస । మిరువుకొనన్ తగినరీతిహితునకుదగుస । త్కారణమొనరించిబాంధవ । వరులాప్తులు
గూడుకొనిసభాస్థలిలోనన్ ॥ గీ ॥ వెంకటాహ్వయుడిట్లనివిన్నవించె । నేసభాపతినరవరు
హృదయమరసి । పుష్పగిరిలోననేనుగోపురముమీయ। నుగ్రహముననుగట్టించినూత్నమొకటి॥
క ॥ ఈయెడబూనితిగీర్వా । ణాయతపుష్పాద్రిఖండమాంధ్రముగాగన్ । సేయింపమదిన
తదభి । ప్రాయమునెరవేర్పమిగులభరమనితోచున్ ॥ చ ॥ అరయగమీరలర్జునునకచ్యుతురీతి
గమాసహాయ్యులై । బరగెదరట్లుగానతమభావముదెల్పిమదీప్సితంబుస । త్వరమునదీర్చగో
రెదనుధార్మికమౌళులటన్నసద్గుణో । త్తరుడనెసంతసిల్లివివిధప్రియసూక్తులనూరడింపుచున్ ॥
క ॥ కరుణాకరయీకృతినే । ర్పరచుటహితమగునుమాకుబహుకార్యములన్ । పరమేశ్వరుడుం
డగనాకభరమగునేమనకుధర్మపథసంచారా ॥ క ॥ అనిపల్కెయేసభాపతి । పసుపడగాజని

రయొపేట్కబళ్లారికినా। ఘనుననిపితనగృహంబున । ననువొప్పగనుండివెంకటాహ్వయుఁడంతన్॥
వ ॥ మరియునతండవక్రవిక్రమవికర్తనప్రభావిదారీకృతారాతిధరానాథతమఃప్రకాండుండనన్య
సౌజన్యవదాన్యపరితోషితమార్గణుండును।నూతనరతికాంతజయంతవసంతనలకూబరోపమాన
సుందరుండునుసకల సామ్రాజ్యలక్ష్మీప్రోల్లసితధనధాన్యసంపూర్ణమందిరుండునుపుష్పాచలసము
త్తుంగగోపురనిర్మాణచాతురీధురీణుండునుదగ్గిరెడ్డివంశపయఃపారావారరాకాసుధాకరుండునా
ర్ద్రిగోత్రోద్భవుండును నాగిరెడ్డివరదాంబాగర్భశుక్తిముక్తాఫలుండునగువెంకటరెడ్డిసమాహ్వ
యుండొక్కనాఁడునిజమందిరప్రాంగణంబునకవిత్వప్రభారవులగుకవులునునిఖిలసజ్జనమనోమాన
ససరోవరహంసులగు విద్వాంసులునుసంగీతకళారహస్యాభిప్రాయగేయకులగుగాయకులునురా
జకార్యనిధానులగుప్రధానులునుయశశ్శ్రీమంతులగు సామంతులునుభట ప్రముఖపరివారసమేతం
బగుసభామధ్యంబుననిండుకొలువుండియొక్కనాఁడు ॥ సీ ॥ తనకుదైవజ్ఞుఁడైతనరుపాండిత్యసా
హాయ్యగుంటూరిసుబ్బయ్యగారు । తనకోరికెలకుచింతామణియనరాజుపల్లెయల్లారెడ్డిభవ్యయశు
డు । తనధర్మగుణమణిఖనియనపెద్దిచిన్నపరెడ్డివిబుధసంతానతరువు । తనకూర్మిసఖుఁడువిత
రణిగుమ్మళ్లవెంకటసుబ్బిరెడ్డిసత్కారపరుఁడు । తనపినతండ్రిసంతతరామభక్తినివాసుఁడౌవెం
కటస్వామిరెడ్డి । తనకుముఖ్యహితుండుప్రధానిమంచి । సుబ్బయామాత్యవర్యుఁడుసూరిజను
లు । సభనుగూర్చుండవిద్వద్విచారవేళ । చర్చసేయంగనానందసరణిమించి ॥ చ ॥ వినుతవి
వేకశీలుఁడగువెంకటరెడ్డిసమాఖ్యభూవరుం। డనియెసుధామయోక్తివినయంబుసభాసదులాలకింప
గా । ననఘముపుష్పభూధరమహత్త్వముసంస్కృతభాషనుండునిం। పునదెనుగింపనోపగలపూ
ర్ణకవీంద్రునెరుంగఁజెప్పరే ॥ క ॥ అనవినిదైవజ్ఞశిఖా । మణివిప్రాన్వయుఁడునీతిమాన్యుఁడువిద్వ।
ద్వినయుఁడుహరిహరభక్తుం । డనఘుఁడుగుంటూరిసుబ్బయాహ్వయుఁడనియెన్ ॥ క ॥ ఆరాధ్యు
లుమీగురువులు । సారార్థనిరూఢశబ్దసంగతకవితా । ధారులగుమొల్గుకాళయ । గారిక్కావ్య
ముదెలుంగుగాఁజేతురొగిన్ ॥ క ॥ వారినిబిలుపించినమ । స్కారముగావించిమీరుకారుణ్యతస ।
త్కారమొనరింపనీకృతి । ధీరమతిన్దెలుగుఁజేసిచెలిపెదరనఘా ॥ క ॥ అనిపల్కుసుబ్బయా
ఖ్యునివ । చనములువినివెంకటాఖ్యసద్గుణిమోదం । బునమమురాబనిచిప్పుడా । వినయోక్తుల
నిట్టులనియెవిబుధులుమెచ్చన్ ॥ గీ ॥ స్వామిదేశికవర్యతత్త్వప్రకాశ। నిధులువిద్యాప్రవీణులునీతి
విదులు। బలుకఁబూనితినీకవిన్నపంబుమీర । లవధరింపుఁడుమ్రొక్కెదహర్షమునను ॥ గీ ॥ గుడి
వనంబుతటాకంబుకూపసుతని । ధానకృతిభూమిదేవతాస్థాపనంబు । లష్టసంతానములుపీటినంది
నట్టి । ధర్మపరులకుస్వర్గసాధనములనిరి ॥ గీ ॥ అట్టిసంతానములలోననధికమైన । కృతియుఁజె

జదనిదానిచేకీర్తి దెసల। నిండిసకలార్థములుగూర్చు నెమకదాని। సాటిలేదని జెప్పిరిచరితలందు ॥
క ॥ కావునపుష్పావనిధర । దేవుమహత్వంబుమీరుతెనుగొనరింపం । గావేడెదకృతిపతిగా । భా
వింపుడుచెన్నకేశవస్వామినొగిన్ ॥ క ॥ శ్రావ్యంబుగనేజెప్పిన । కావ్యంబొనరింపమీరుకర్తలు
గురువుల్ । భవ్యమతులనఘనేనిడు । ద్రవ్యంబననెంతనిఖిలతత్వజ్ఞనిధీ ॥ క ॥ అనిదివ్యాంబరమ
ణికాం। చనభూషణభూమిదానచయములుధనముల్ ఘనసారవీటికలని ।చ్చినసంతసమావహిల్లి
చేకొనియంతన్ ॥ఉ॥ వెంకటరెడ్డియీకృతినివేడ్కనొనర్పుమటంచువేడుటన్ । బంకజపత్రలో
చనుడుభర్తయుగావునమేలుజెందదే। సంకటమైనదీర్పగనుజాలడె కేశవుడాదిమూర్తినా। వం
కగటాక్షముల్నిలిపివత్సలతన్ దయజూడకుండునే॥ గీ ॥పూర్ణజైవాతృకునిగూర్మిబొందురాత్రి।క
రణిమత్కావ్యసతిధవుగాగపుష్ప । గిరివరనివేశుశ్రీచెన్నకేశవేశు । పరిణయంబయ్యెనాపుణ్య
ఫలముగాదె ॥వ॥ అనినిశ్చయించిమదిష్టలింగారాధనంబొనర్చియానందకందళితాంతరంగుండనై
నిదురించుసమయంబున ॥ సీ ॥ పసిమిజడలతలపైనజెన్నొందువెన్నెలతునకదళతళవెలుగుచుండ।
రతనంపుపడిగెలరాణించుజిల్వలచౌకట్లువీనులజౌకళింప । మొలకనవ్వులుగుల్కుమోముపైతెలి
బూదిసింగారమొకవింతచెంగలింప । వెలలేనిజవ్వవన్నెలనింపునికరంపుటాణిముత్తెపుసరులఱుత
వ్రేల। మేనమగతాలసొమ్ములుమెఱయుచుండ। గేలబటికంపుగనుదండగిలుకొల్పి।మునిగురుండగు
దక్షిణామూర్తినాదు ।కలనుబొడసూపెదెసరాచకొలముగొలువ॥ క ॥ బుడుతనిగడతేర్చుటకై ।
పొడజూపెనుశివుడటంచుపొంగియడుగులన్। బడియానందాశ్రులచే। దడపిననను కేలనెత్తిదయ
నిట్లనియెన్॥ గీ ॥ వత్సమామకకరుణగావ్యములుజెక్క। గూర్చినాడవుమున్నిఘ్నకుసుమశైల।ఖం
డముదెనుంగుజేసితత్కర్తజెన్న। కేశవస్వామిగాజేసికీర్తివడయు॥ క ॥నేననవైకుంఠుండన। గా
నొక్కటిగాకవేఱుగలదేమమ్మున్।ధ్యానసుతుల్గావించిన। మానవులకుశుభములిచ్చిమనుతుముకూ
ర్మిన్॥ గీ ॥ అనికృపారసముప్పొంగనానతిచ్చి। తనప్రసాదంబొసంగిచింతలనుబాపి। ప్రమథగణ
యక్షదేవతాప్రభులతోడ।మగుడనంతర్హితుండయ్యెమదనవైరి॥ చ ॥కలగనిమేలుకాంచిపురఘస్మ
రునాజ్ఞ మదిన్ దలంచినే।వలతినెపాకవృత్తులభివర్ణనజేసికృతుల్రచింపవ్యా। కులతవహింపనేలజత
గూర్పగనేరడెశంకరుండున। న్నలమటజెట్టునేమనుగృతార్థునిజేయదలంచివెండియున్ ॥ వ ॥అ
నినిశ్చయించిమదిష్టదైవంబగుమేధాదక్షిణామూర్తి ప్రసాదంబుగొనిమంగళాచరణంబుగాగృతి
నాథుండైనచెన్నకేశవస్వామినభివర్ణించెద ॥ సీ ॥ శ్రీరుక్మిణీలోలశ్రితజనపరిపాలబాలగోపాలద
యాలవాల।కలుషకాననజాలవిలయానలజ్వాలమానీంద్రదివ్యచిత్తానుకూల।చండవిక్రాంతరాక్ష
సతూలవాతూలఘనకటిబద్ధకాంచనదుకూల। సామజనాథరక్షాదక్షశుభశీలచాణూరశకటవత్సక

విఘాల। స్ఫురితవాగ్జాలశుభ్రయశోవిశాల । కౌస్తుభోద్దీప్తమౌక్తికకంఠమాల । కంధరవినీలనందితకామపాల । ప్రసవగిరిచెన్నకేశవప్రథమలీల ॥ క ॥ శ్రీదేవీవల్లభుచి । న్మాదాత్మానందవేణునాదప్రియదా । మోదరముకుందహతదు । ర్వాదా శ్రీచెన్నకేశవస్వామిహరీ. ❊ ❊

## (షష్ఠ్యంతములు.)

క ॥ శాంతునకభివర్ధితవే। దాంతునకశ్రాంతపోషితామరపతికా। క్రాంతానురక్తగోపీ। స్వాంతునకుఁ భక్తవిపినవాసంతునకుఁ ॥ క ॥ శౌరికిదూరీకృతసం । సారమహాతాపసేంద్రసంఘాతమనో । హారికిమత్తాసురసం । హారికిసామజభయాపహారికిహరికిఁ ॥ క ॥అభ్రంకషగోపురసా । లభ్రాజితకుడ్యరత్నలావణ్యకళా । విభ్రాణమంటపావృత । శుభ్రాలయవాసునకును శుభచరితునకుఁ ॥ క ॥ చండాంశుమండలాంతర । మండితతేజఃప్రకాండమధ్యస్థునకుఁ। జండీశప్రియసఖునకు । ఖండీకృతశత్రునకునుఘనగాత్రునకుఁ ॥ క ॥ మంథానశైలమర్దిత । సింధూద్భవకన్యకావిజృంభితవక్షు । స్సంధికిహతదైవతపరి । పంథికిదూరీకృతాఘబంధావళికిఁ ॥క॥ మూర్తిత్రయకందునకని । వర్తితకర్మానుబంధపరిహర్తృనకుఁ । గర్తకుభక్తావనస । త్కీర్తికి పుష్పాద్రిచెన్నకేశవహరికిఁ ॥సమర్పితంబుగానాయొనర్పంబూనినపుష్పాచలఖండంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన. ❊ ❊ ❊ ❊ ❊ ❊ ❊

## కథాప్రారంభము.

వ ॥ కలదాత్మానుభవప్రచారవిలసత్కర్మందిసంఘాతని ।ర్మలహోమానలధూమకందళితపత్రవ్రాతదేవద్రుమా।వళిసంజాతమరుత్ప్రచారవిచలద్వారిప్రవాహోర్మిశీ।తలతీరంబగునైమిశంబనెడికాంతారంబుభూమీస్థలిఁ॥క॥ఆవనిశౌనకతాపస।శేవధిమొదలైనమౌనిశేఖరులుకథాప్రావీణ్యుజైమినికిజి।త్తావిర్భవహర్షమొప్పననిరిట్లనుచుఁ॥క॥మునుబ్రహ్మాండపురాణం।బునగల్గిన దివ్యకథలుబోధించెడిచో।టనుభృగుకులభవరాముం। డనయంబొనరించెరాజహత్యలటంచుఁ॥ గీ ॥ తెలిపితిరిమీరుచక్రవర్తిహననంబు । బ్రహ్మహత్యలకన్ననుపాపమధికః మనిరిపండితులదిజేసినట్టిరేణు । కాత్మజుండేమిగతిజెందెననఘమూర్తి ॥ క ॥ తద్దోషంబారాముం । డెద్దానంబాపుకొనియెనెరిగింపుముమా । బుద్ధులుదత్కథవినగా । దద్దయునుత్సుకములయ్యెదాపసవర్యా ॥ వ ॥ అనినశౌనకాదులకుజైమినిమునీంద్రుండిట్లనియె ॥ చ ॥ పరభయవిక్రమస్ఫురితభార్గవరాముడుకార్తవీర్యసం। గరమునగూల్చితాతపదకంజనమస్కృతిజేయనమ్మునీ । శ్వరుడుదనూజుగాంచినృపసంహరణంబుమహాఘమీవుడు । స్తరదురితంబుజెందితివిసంయమివర్తనులిట్లొనర్తురే॥ గీ ॥ రాజహత్యయొకేడగురాజమాత్రు । డగునెకృతవీర్యసుతుడుమూర్ధాభిషిక్త । సార్వభౌముం

డుతద్వీరుజంపిదొడ్డ । కలుషమందితివేమనగలనునిన్ను ॥ క ॥ దీనికినిష్కృతివినుమా । మౌని
వ్రతమూనితీర్థమండలయాత్రా । మానసతబుష్పగిరిసం । స్థానంబునదపముసల్పజనుమచ్చో
టన్ ॥ క ॥ లింగముబ్రతిష్ఠజేసివి । ధింగలదానములొసంగిఘోరతసీవా । బ్రాంగణపినాకినీతటి।
నింగ్రుంకినహత్యబాయునీకుగుమారా ॥ గీ ॥ అనుచుజమదగ్నిబోధింపనతడుకూర్మి । సఖుడు
గంధర్వసంతతిస్వామినిఖిల । వేద్యుడైనసుహస్తుడువెంటరాగ । హర్షమునసేగెతీర్థంబులాడదల
లచి ॥ క ॥ కాశీప్రయాగగయలును । శ్రీశైలంబాదినిధులుసేవించికృపా । పేశలమతిత్రిపురాం
తక । పాశుపతస్థలముజేరెభార్గవుడంతన్ ॥ క ॥ అనఘుడుగంధర్వాధిప । తినిగూడిభృగూద్వ
హుండుత్రిపురాంతకశో। ధనజేసిజలనిధిపినా। కినిసంగమదర్శనోత్సుకీభూతుండై॥ సీ ॥ చనువే
ళతెరువునజమదగ్నిసూనుండుజిత్తసంతోషంబుజెందజేయు । పుణ్యదాయకములైపొల్పొందునె
వ్వియొ । తత్తీర్థములగ్రుంకిధర్మయుక్తి । జపపానతర్పణసంధ్యాదులనుదీర్చియటసాగిలోచన
హర్షమైన । సంగమేశ్వరమహాస్థానంబునకువచ్చిశరధిపినాకినీసంగమంబు । నెచటనోయందుశ్రీ
సంగమేశుజూచి। పెన్నకణ్వమహానదిభృగుసరిత్తు । మూడునొక్కటమున్నిటిగూడుచోట ।జ
లములనుగ్రుంకిసంయమీశ్వరుడుగూర్మి ॥ క ॥ పంచాక్షర్యుచ్చారణ । బంచామృతసేచనంబు
భార్గవమునిగా । వించుచునిత్యముహరుగీ।ర్తించుచుదపమాచరించెదివ్యులుమెచ్చన్॥ చ ॥ హ
రునకుసంతసంబుగదదర్చనజేయుచుసంజలన్నిరం । తరమెడలేకనొక్కనెల తన్నదినీరధిగూడు
చోటసా । గరతటమందురాముడుసుఖంబుననుండసుహస్తనామకుం । డురుమధురోక్తులన్బలి
కెనుత్సుకతన్మనమూరడిల్లగన్ ॥ చ ॥ వినుభృగురామయీనదిపవిత్రమహత్వముసర్వపాపనా।
శనమగుబూర్వకాలమునశంభుడుసంజనటింపనందికొం । డనుజడకొద్దికొట్టినపినాకినినానదిబు
ట్టెదానినీ । టనుసమయోచితంబులుదృఢంబుగసల్పెజలానుకాంక్షతన్ ॥ క ॥ నటనంబాడగగని
ముం।దటనిల్చినదీలలామదర్పకరిపువి।స్ఫుటఘణితినుతింపుచుకర।పుటములుముకుళించినేరుపుననిట్లని
నియెన్॥ఉ॥ఎచ్చటికేగుదానతెరవెయ్యదియన్నహరుండువల్కెనీ।విచ్చటనుండిగంగవలెనిచ్చను
బావనమూర్తివైజలం । బెచ్చుగనర్ణవంబుననహీనతజేరుదువంతవట్టుము।న్నచ్చుగతానమాడె
డుమహాత్ములుబాపముజెందరెన్నడున్॥ క ॥ ముసలినరవియుండగదే । వసరిత్తేనెజలమునవసి
యించునుని । ర్వ్యసనతగ్రుంకులనిడుమా । నుసులకభీష్టంబులిచ్చినుతిగాంతువిలన్ ॥ క ॥ అన
వినిశివునకునదియి । ట్లనునేసేదోవనేగనర్హానునేనాం । టినిగదనాతెరవెరుగిం।పనునాతోగూ
డిరమ్ముభవదయమీఱన్ ॥ అనిపలికిననన్నదికిశివుండిట్లనియె ॥ గీ ॥ కార్ముకాగ్రంబుననుభువిగ
ర్తమమర । దీసియీజాడనేగుమతిరయముగను । నెచ్చటెచటికిమందునేనేగుచుంద । నట్టి

తెరవునరమ్మునన్ననుసరించి ॥ చ ॥ అనినియమించిశంభుడుమహాబలపూర్ణసరిత్తువెంటరా । జని
యెనుప్రాఙ్ముఖుండగుచుచయ్యననందినగంబుడిగ్గిపో । వనుదననంటిమార్గముప్రవాహినిదప్పక
తురంగభంగమం। డనమగుస్రోతముల్దగదిటంబుగచెంగటవచ్చుచుండగాన్ ॥ ఉ ॥ పూరితని
మ్నగాన్వయవిభూషణమౌనదిముందుబోవుమా । రారికిదోచెతూర్పుదెసనడ్డముగావృషభాద్రి
నుండివి । స్తారతశ్రీగిరిందగిలిద్వాదశయోజనదూరమందునన్ । ఘోరనగంబుఖోత్కమణశీర్ష
ముగాంచిమహోగ్రమూర్తియై ॥ మ ॥ తనశూలంబునశైలమున్నరికిహృద్యంబౌపథంబేర్పడం
గనుగావింపుచుముందుకొండలనువ్రక్కల్జేసిఘంటాపథం । బునుజూపించెపినాకినీనదికిసంపూర్ణ
ప్రతాపంబుతో । నినశశ్యగ్నివిలోచనుండుహరివాణీశుల్నుతుల్జేయగన్ ॥ క ॥ పురహరుడు
జూపుతెరువున । నరిగిధునీతరుణియమ్మహార్ణవవరుస । త్వరమునగలసీక్రపాళున్హరుగనికేల్మో
డ్చియిట్టులనెవేడు కతోన్ ॥ మ ॥ హరనేనెచ్చటబుట్టియెచ్చటనునిత్యాసక్తిరెట్టింపసా । గర
మున్గూడితినంతవట్టుమదివేట్కన్జెందిగౌరీమనో । హరమీరచ్చటనచ్చటన్నిలిచిధన్యంజే
యగానాకునీ । వరమివ్వందగుగాకవేఱొకటిసేవాంఛింపగంగాధరా ॥ సీ ॥ అనువచనంబులు
నాలించిశ్రీకంఠుడన్నదీస్నేహవశాత్ముడగుచు । నక్కడక్కడదత్తటావనీస్థళములజతబాయకను
నిల్చెజంద్రధరుడు । గావుననందినగంబుమొదల్కొనిక్రమమునగంధిసంగమముదనుక । పరికిం
పమండపప్రాకారయుతములౌభీమాలయంబులుపెక్కుగలవు । కరపినాకశరాసనాగ్రంబువలన।
హరుడుమార్గంబుసేయనందరుగుకతన । ధరపినాకినినామముదాల్చిసకల । పుణ్యదాయనినా
మించుబుధవరేణ్య ॥ క ॥ ఇన్నదిపావనతకునిం । దున్నాడభవుండువీతిహోత్రాత్మడుశ్రీ।
మన్నారాయణసఖునిమ । హోన్నతిబూజింపుమిష్టమొసగుమహాత్మా ॥ గీ ॥ ఈమహిమమె
న్ననాశ్చర్యమేరికైన । పాపములడంచిమోక్షసంపదలొసంగు । బుష్పగిరికేగియచ్చటబోధజే
తు । దివ్యఫలదాయకంబైనదీనివిధము ॥ క ॥ ఈసంగమేశశంకరు । డేసర్వఫలప్రదానహే
తుడుచిత్తో । ల్లాసతబూజింపుముప్ర। త్యాసన్నుడుగాడెసేవకావళులకిలన్ ॥ చ ॥ అనెడుసు
హస్తుభాషణములాదరతన్వినిసంగమేశశం। భునిభజియించిభార్గవుడపూర్వశుభంబులుగాంచితృ
ప్తుడై । మనములరంగబుష్పగిరిమారవిరోధినిజూచుగాంక్షతో । జనసమకట్టిగాయకుడుసంత
సిలన్నిజభక్తిమీరగన్ ॥ క ॥ అనుజైమినినామకస । న్మునిపల్కులుశౌనకాదిమునులామోదం।
బునవినిముందటగలగా । థనుదెలుపగగోరిరఖిలధర్మప్రియులై ॥ మ ॥ విపదంభోనిధికుంభసంభ
వభవప్రీత్యర్థసన్మోహినీ । కపటాకారనిదానదానవిచలత్రక్రవ్యాదఘానాయక । ద్విపశింహప్ర
తిమానమానసహరద్వేణ్యాగతాత్మీయరా । గపినద్ధవ్రజకామినీనివహసంకల్పప్రదాకల్పకా॥

మాలినీ ॥ దినమణిశశినేత్రాదీనకాంతారచైత్రా । దనుజతిమిరమిత్రా తత్త్వమస్యర్థమిత్రా । ఘననిభశుభగాత్రాకంధికన్యాకళత్రా । కనదఘువనదాత్రాకాద్రవేయారిపత్రా ॥ క ॥ సనకసనందనముఖస । న్మునిమానసజలజమిత్ర మోహనగాత్రా । కనకమయమృదులనేత్రా । ఘనమగ్ధాంభోధిశాయికరివరదాయీ ॥ ఇది శ్రీమన్మేధాదక్షిణామూర్తి వరప్రసాదలబ్ధకవితానైపథ్య వేమనారాధ్యముగ్ధసంగేశ్వరపుత్ర కౌండిన్యసగోత్రపవిత్ర శివానుగ్రహానుషంగ శ్రీకాళహస్తిలింగ విరచితంబగు పుష్పాచలఖండంబునందిష్ట దేవతా ప్రార్థనంబును గురునమస్కారంబును సంస్కృతాంధ్రకవీంద్రస్తవనంబును ప్రేరకవంశాభివర్ణనంబును శ్రీమత్పరమహంసపరివ్రాట్ఛంకరాచార్య జగద్గురుపరంపరాభివర్ణనయు నుకృతినాయక చెన్నకేశవస్వామ్యభివర్ణనంబును పినాకినీజననంబును తన్మహిమయుం గల ప్రథమాశ్వాసము సంపూర్ణము. ❊ ❊ ❊ ❊ ❊ ❊ ❊







శ్రీరస్తు.

# పుష్పాచలఖండము.



## ద్వితీయాశ్వాసము.

శ్రీయదువంశోద్వహసుమ । సాయకశతకోటితుల్యసౌందర్యరమా । నాయకకమలజము
ఖసుర । గేయాపుష్పాద్రిచెన్నకేశవరాయా ॥ దేవావినగటాత్కింపుము ॥ గీ ॥ అట్టిజైమిని
మునిపల్కులాలకించి । శౌనకాదిమహర్షులుసంతసమున । బరశురాముడుసుమగిరిపథముబట్టి।
యేతెరంగయ్యెదెల్పుమఋషివరేణ్యా ॥ చ ॥ అనవినిమౌనియిట్లనియెనాభృగురాముడుకార్ము
కంబుజే । కొనితనముందటన్నిగులగూర్మిసుహస్తుడుజూపుమార్గమం । దనయముపుణ్యభూము
లుమహానగముల్గనుగొంచువైద్యనా । థునిగననేగెమానసముతోరవుపేదుకలిమ్మడింపగ౯ ॥ గీ ॥
అట్టిగంధర్వపతియుదన్ననుసరింప । దివ్యసలిలపినాకినీతీరమందు । భక్తిసంయుక్తచిత్తుడైభా
ర్గవుండు। సాధుహృన్నాథుడగువైద్యనాథుగనియె ॥ క ॥ భవశతములనార్జించిన। భవరోగ
ములపరిహరించిప్రజలనుబ్రోవ౯ । భువివైద్యనాథనామము । భవునకుసార్థకతజెందెప్రమథు
లుబొగడ౯ ॥ వ ॥ కనియాత్మప్రియుతోడనాశివునుతుల్గావించిభావించిప్రా । క్తనలింగంబుల
నచ్చటచ్చటభువి౯దర్శించిపూజించిశాం । తనయాధారితపంబునేయనొకయబ్దంబుండగా
రేణుకా।తనయు౯గాంచియొకానొకప్రహితగంధర్వప్రభుండిట్లను౯ ॥ గీ ॥వినుముభార్గవవైద్య
నాథునిమహత్వ । మఘహరంబిష్టసిద్ధిమోక్షాకరంబు । వక్తృశ్రోతులకానందవహమటంచు।ద

### ※వైశ్వానచరిత్రము.※

త్కథనుజెప్పదొడగెగంధర్వుడంత ॥ ఉ ॥ రాజులపట్టుగొమ్మకవిరాజులకల్పమహీరుహంబువి ।
భ్రాజితభోగభాగ్యనిధిపండితగాయకనర్తకాంగనా । రాజికిజన్మభూస్థలిధరారమణీగళతార
హారమై । రాజమహేంద్రపట్టణమురంజిలులోకమనోభిరామత౯॥ క ॥ ఆపురముగోపురోత్క
ష । గోపురమైపావనోర్మిగోదావరిగం । గాపారమందసిరులకుగాపురమైవెలయునిత్యకల్యా
ణముల౯ ॥ ఉ ॥ ఆనగరంబులోనవివిధాధ్వరశీలుడుతాపసుండువి । జ్ఞానిశుచివ్రతుండుమదక
ల్మషదూరుడుశైవమార్గసం । ధానమనస్కుడాఢ్యుడువిధాతృకులాభరణైకకీర్తివి । శ్వానర
నామసంయమినివాసముజేసెనుభార్గవోత్తమా ॥ గీ ॥ అతనికులభామసరసగుణాభిరామ । క

ల్మషవిరామదివ్యశృంగారధామ । ముఖవిజితసోమపతిభక్తిముఖ్యసీమ । దీప్తిమతినామనిఖిల సాధ్వీలలామ ॥ ఉ ॥ ఆనలినాక్షియందుదనయత్రయమున్మనుగాంచిపిమ్మటన్ । సూనునఖండ భాపటలసూర్యసమానుగనైన్ పయోధిసం । తానమహీజమున్ బలెముదంబుమనంబునబిక్కటిల్లవి । శ్వానరుడొప్పెసూరిజనసంస్తవనంబులునింగిముట్టగన్ ॥ గీ ॥ అట్టిసుతుజన్మకాలమందమరవితతి|పుష్పవర్షంబుగురిసెవేల్పులవెలందు|లాడిరిప్రసన్నతనుదాల్చియఖిలదిశలు|తోచెమింటనుదేవదుందుభులుమ్రోసె ॥ క ॥ జననాదిబాలదోషము । లనుదొలగన్ జేయుమంత్రలక్షణ శక్తిన్ । దనయునిరక్షింపుచుబది । దినములుతగగడపిపురుడుదీర్చినపిదపన్ ॥ గీ ॥ జాత కర్మంబునొనరించుసమయమరసి । శాస్త్రసమ్మతముగనువిశ్వానరుండు । నిఖిలబాంధవభూసుర నివహములను । బిలిచిపుణ్యాహమొనరించిప్రియముమీర ॥ గీ ॥ కాంతిమిగిలియున్నకన్నపట్టిని జూచి । యూరుతలమునందునునిచిశిరము । మూరుకొనుచుదంప్రీముదముననాబృహ । ద్భానుడనుచుపేరుదయనొసంగె ॥ క ॥ ఆవేళనెనరుమీరగ । దేవాస్థానముననుండిదేవేంద్రుడుసం । భావింపగవచ్చెనుభూ । దేవాగ్రణిభవనమునకుదివిజులుగొల్వన్ ॥ క ॥ చనుదెంచినసురవరునకు|వినతుండైయర్ఘ్యమిచ్చివిప్రవరుండా । ననసుస్థితుజేసిమహా| వినయంబుననుతులొనర్చెవేదోక్తులచేన్ ॥ ఉ ॥ బత్తిగనాతడిచ్చినసపర్యలసంతసమందిదేవతా । సత్తముడానతిచ్చెద్విజసత్తమతావకసూనుజూడగా । జిత్తముగల్గివచ్చితిమిచెప్పెదమీతనికేమొసంగున । త్యుత్తమనామముల్వేలయనుత్సుకతన్వినుమన్నినేర్పునన్ ॥ వ ॥ అవియెయ్యవియంటేనివైశ్వానరాగ్నివహ్నిపావకహిరణ్యరేతోధనంజయవాయుసఖశిఖావద్వీతిహోత్రకృశానుజాతవేదశ్శుక్రసప్తార్చిశ్శుచిబర్హిర్హవ్యవాహనసప్తజిహ్వఘ్రాగ్రమూర్ధాశతనూనపాద్బృహద్భానుకృష్ణగతికృపీటయోన్యుషర్బుధజ్వలనులనుసమాఖ్యలుమేమొసంగితిమింకొకవిశేషంబుజెప్పెదమాలకింపుము ॥ క ॥ నిజబలమువలనబుట్టెడు| విజయంబులుపుణ్యములువివేకంబులుస । ద్ద్విజహితములైననామము । లజవంశాభరణ యెక్కలగుపుత్రునకున్ ॥ ఉ ॥ కావుననీవునీతనయుగారవమొప్పగబెంచుముందుచే । వావళికిన్ముఖంబగుదయాపరుడిష్టుడుబంధుడున్నధా । పావనమూర్తియీఘనునిభవ్యగుణార్జితకర్మసంభవ । త్కేవలవైభవంబుబరికింతువుముందరభూసురోత్తమా॥క॥ ఈరీతిగదెలిపిశునా|సీరాదులుస్వర్గమునకుజేరిరిపిదపన్। గూరిమివిశ్వానరుడుగు| మారవరున్ బెనుచుచుండెమదనాకారున్॥ క ॥దొలుతనువిశ్వానరునకు| గలిగినతనయులునుమువురుకడుపేడుకని । శ్చలపితృదేవత్వమునం| దలరిరిస్వర్గమునగవ్యహవ్యావహులై ॥ గీ ॥ అట్టిమువ్వురుతనయులకానుజన్ము । డగుబృహద్భానువిశ్వానరాఖ్యవిప్రు । డతనిసతిదీప్తిమతిముదంబావహిల్ల । బెనిచిరతిరక్తిగారవంబినుమడిం

ప ॥ గీ ॥ యక్తసమయంబరసికుమారోత్తమునకు। హర్షమిగురింపగానక్షురాభ్యాసనము । మొదలుగాగలశుభకృత్యములనుదీర్చి । బాంధవులతోడయోచించిబ్రాహ్మణుండు ॥ క ॥ గర్భాష్టమవత్సరమున । నర్భకునీక్షించియుపనయనముఁ గరుణా।విర్భావతజేసెనతిధి। నిర్భీతుభయాంగమంబుదూరముగాగ ॥ క ॥ స్వాధ్యాయముజదువంగను । పాధ్యాయులకడనునిల్పబాలుడశీలవి । ద్యాధ్యాయములోకక్షణమున । నధ్యయనముజేసినేర్చుహర్షముమీరఁ ॥ వ ॥ ఇట్లుబ్బాలుండువేదవేదాంగవిదుండైయుండుసమయంబున ॥ క ॥ పారదహారదరాంబుజ । శారదనీరదపటీరసారశరీరుం । డారయరెండవహరుడన। నారదుడేతెంచెమానినాథునికడకుఁ ॥ క ॥ చనుదెంచినసురమునిగని । మనమానందామృతాబ్ధిమగ్నతజెందం । గనునర్ఘ్యంబిడిదర్భా । సనమునగూర్చుండఁబెట్టిశరణనిపొగడఁ ॥ గీ ॥ పరమమునియెన్మిదేడులబాలుజూచి । కరుణతోడాయబిల్చియంకమునజేర్చి। కరపదశిరోధినాభినిగనులవదన । మందులక్షణరేఖలనరసిమెచ్చి॥ క ॥ ఆనారదమునినిజహృద । యానందంబుప్పతిల్లనబ్బాలకుభా । గ్యానూనస్థితులనువి । శ్వానరునకుజెప్పబూనెశాస్త్రోక్తులచేఁ ॥ గీ ॥ ఓయిమునివరనీదుభాగ్యోదయంబు । నెన్నశక్యమెకలవిధంబెరుకపఱతు । వినయమాకారకాంతివివేకకర్మ ।లందుమీదంపతులకుతుల్యుడగుసుతుండు॥ చ ॥ నెనరునజెప్పజాలనవనీసురభూషణగోప్యమున్నదై । ననుగనిదాచనేటికిమనంబునగాగలదేలతప్పనీ । తనయుడుదేవభావముయథావిధిగైకొనముప్పదేండ్లపై । దునుమబడుఁ శిరంబువిధిత్రోవదాలంగగజేయవచ్చునే ॥ గీ ॥ చింతసేయంగవలదుమీచిత్తమంద । టంచుదెలియంగబలికితదాత్మజాతు । నచ్చటనుడించితపసిసురాలయమున । కరిగెస్వేచ్ఛావిహారియైహర్షమునను ॥ గీ ॥ అంతనారదువాక్యంబులాలకించి । తల్లిదండ్రులుమాటికిదలచితలచి । తనయుగౌగిటజేర్చిసంతాపమునను । తల్లడిల్లిరిభువిదిగంతములుగలగ ॥ అంత ॥ క ॥ దీనులతలిదండ్రులద । త్సూనుండూరార్చిపలికెశోకాంబుధిపా । లైననుధరనెవ్వారికి । గానున్నఫలంబుదప్పగాబోవునాకో ॥ గీ ॥ ఏలననుగూర్చిచింతింపనెవడుతండ్రి । యెవడుతనయుండుజీవసంసృష్టికొరకు । దేహముత్పత్తియగుటసందియములేదు । ధరణినిదియునిమిత్తమాత్రంబుగాదె ॥ మ ॥ ధరదైవేచ్ఛనుశుక్లమున్నరుడుముఁ తాదాల్చియాత్మాంగనా । సురతంబందినగర్భమున్నిలుచునచ్చోలందుబిండంబుభా । స్వరమైజీవతదాల్చితాదశమమాసంబందుజన్మించుదు । స్తరకర్మార్జితభోగముల్గొనయథార్థంబింతనమ్మందగుఁ ॥ క ॥ జననంబుమొదలుగాగను । తనపూర్వభవంబునందుదనరినకర్మం । బనుభవముగువ్యథపడుచుఁ । మనమునయోచింపనేలమానుముతండ్రీ। ఉ॥ పుట్టెడివారికిఁ భువినిపుట్టినవారికివారితోడనే।బుట్టునుమృత్యువప్పలుకుబొంకగునాసదయో

త్ములారగన్ । పట్టునుసర్వసాక్షియయుబాయదొకప్పుడునట్లుగావునన్ । గట్టిగనేడ్చినన్ సు
ఖముగల్గనెమానవకోటికెప్పుడున్ ॥ చ ॥ జననమునొందువానికినిసత్యముమృత్యువుచచ్చె నేని
య । మ్మనుజునకబ్బుజన్మమదిమానసమందుదలంచికాదెస । జ్జనములుమానిరావ్యథనుసంశయ
మేటికిమిత్తిగెల్వనే। పనిగొనితారశైలపతిభర్గునిశంకరునాశ్రయించెదన్ ॥ గీ ॥ అనుచునూరా
ర్చిపితరులనాత్మజనుల ।వారియాజ్ఞనుగైకొనిధీరవర్యు। డాబృహద్భానుడంతతపోనురక్తి। వన
మునకుజేరబోయెనవార్యగతిని ॥ ఉ ॥ కేవలధైర్యమూనిబుధగేయుడుకాననసీమనేగనా । నా
విధధర్మవేదియగునారదుడమ్మునిబాలుముందుగా । రివిధురీతినొచదలపృథ్వినిసోకనమస్కరించి
స । ద్భావతనిల్వనమ్మునితపస్విసుతున్ గనిసంతసిల్లుచున్ ॥ గీ ॥ పరమకృపతోడననియెనబ్బా
లుజూచి । వత్సతపమొనరింపగవలదుదూర। మరుగనామాటహితముగానాలకింపు । సీతలంపెల్ల
నొనగూడనేర్చువిధము ॥ మ ॥ ఇటకున్మప్పదియోజనంబులనుద్రాద్ధేశాశకైబోవన । చ్చటపు
ష్పాగముదానిపశ్చిమరసాస్థానుండువైద్యేశుడా । దటవర్తిల్లుపినాకినీతటముచెంతంజేరిసద్భక్తి
తో । నిటలాక్షున్ శరణంబువేడుమతడేనీకిచ్చునిష్టార్థముల్ ॥ క ॥ అనిబోధించిబృహద్భా । ను
నివీట్కొనిమానియతనినుతులకెలరిస । య్యననరుగగనవ్విప్రుడు । జనియెన్ శ్రీవైద్యనాథసద
నోన్ముఖుడై ॥ గీ ॥ దైవమునిపల్కుమదిలోనదాల్చిపుష్ప। భూధరమునకుపశ్చిమభూస్థలమున ।
వరపినాకినితటమందువైద్యనాథు। పార్వతీనాథుగాంచెనబ్బాలకుండు॥ గీ ॥ వైద్యనాథునిమ్రో
లదివంబురాత్రి । యనకపంచాక్షరీమంత్రమునుజపించు । శైఖరికకింశుకాశ్వత్థసహితపాయ । సా
న్నమునవేల్చుప్రొద్దుననను దినంబు ॥ క ॥ త్ర్యంబకమనువునపూర్వో । క్తంబగురీతిగనుతిలలుత
గజేరిచివే । ల్చుంబ్రహ్మకులజుడునుస్వ । యంబగుమూర్త్యంతరాగ్నియందాసక్తిన్ ॥ క ॥ సత
తధ్యానసమాధిని । నతులమహిమమిత్తిమొత్తునతడేతనకున్ । గతిగాననన్యచిత్తత । నతిభక్తి
వశుండుతపముదగ్రతజేసెన్ ॥ ఉ ॥ అంతవసంతమంగజకరాంతరకుంతముకోకిలార్భటీ । క్రాం
తదిగంతమంచితమరందవశీకృతభృంగదంపతీ । స్వాంతమఖండపాంథవిరహానలకారణకుందజా
తివా । సంతలతాంతజాలవిలసద్రసకాంతముదోచెభూస్థలిన్॥ ఉ ॥ అమనిలచ్చిమాధవసమాగ
తయాటనెటింగివల్లరీ । తామరసాక్షులున్మకుళదంతహసద్యుతులొప్పబల్లవ । స్తోమపుటారతు
ల్మిగులసొంపుదలిర్పగనెత్తికోకిల । గ్రామణిపంచమోక్తులనురంజిలుపాటలుబాడిరయ్యెడన్ ॥
చ ॥ లతలనుప్రోఢలేమలుసలక్షణకాలముదప్పకుండగా। ఋతుమతులయ్యెపెంపువహియింపుచు
సోలిమరుద్విలాసిసం । గతరతిగల్గికుట్మలపుగర్భములన్ బ్రసవించిపెంచగా । నతిశయమొందు
శాబకులొయన్నటుదోచెవనీశలాటువుల్ ॥ క ॥ వనరాశిసంజ్ఞజేకొను । వనమగుటన్ మానిక

ములవశ్యమలరేనా । గనుఫలములరుణిమపుచా । యనుమించెనుశారికశుకములనుమోదింపఁ ॥
గీ ॥ అట్టిమధుమాసవేళగోత్రామరుండు । తలిరుటాకులమెసగిసదాశివుండు । తనకుశరణుని
గానెంచితపమొనర్చె। దృఢతరంబైనభక్తిసందీప్తుడగుచు ॥ క ॥ ఆసమయంబునజగతిని । వేస
విదీపించెజగమువేసారగసం । త్రాసంబైపాంథజనా। యాసంబైవిస్ఫులింగకావాసంబై ॥ సీ॥
చండాంశువులరవిజలముబీల్వగనేరకార్చిచ్చులడవులగ్రమ్ముదేర । పథికసంఘములుప్రపాతటిజే
రపత్రరథముల్తరుకోటరములదూర । సతిపతుల్రతివేళచల్లగాడ్పులుగోరదివములరాత్రులతృ
ష్ణమీర । విస్ఫులింగములురవిమణులడిగజాఱవడివడద్దగిలిపెన్మడువులార । జనులువేసారుగ్రీ
ష్మర్తుసమయమందు । జ్వలితపంచాగ్నిమధ్యమస్థలిననిలిచి । శర్వుపైచిత్తముంచివైశ్వానరుండు।
కఠినతపమాచరించెలోకములుబెదర॥ మ ॥ఇనుడైచండమయూఖసంజ్ఞగొనిమున్నేచఁ జగంబెల్ల
జీ । వనదైన్యంబువహించికుందెననికావఁ లోకబాంధవ్యతఁ । ఘనుడైజంతువులుల్లసిల్లగప
యఃకాండంబులఁ గూర్చిమిం । చెనుదానైవిషవృత్తిమానెననదోచెన్వానకాలంబిలఁ ॥ చ ॥
మొగులనువెన్నుడాపుడమిముద్దియపెండిలికేగుదేరపెం । పుగతగువాద్యదీపికలుపువ్వులబంతు
లుముందుబట్టుచె । ల్వగుమణిచిత్రతోరణములైవిలసిల్లెననంగగర్జితం । బగణితచంచల్కారకలైం
ద్రధనుస్సులుదోచెమిన్నునఁ ॥ గీ ॥ అట్టిజడిలోనవిశ్వానరాత్మజుండు । నేకపాదముభువిమో
పివృష్టికోర్చి । పర్వతముక్రియనిశ్చలభావమూని । తపముగావించెమృత్యువిదారిగూర్చి ॥ క ॥
నీరములువదలితెల్లం । బారెనుమేఘములులోనుబడిశైవలినుల్ । బారెనునిర్మలరుచిగల । శా
రదకాలంబుదోచెజనసమ్మదమై ॥ ఉ ॥వెన్నలరేనివైభవమువిశ్వమునిండగచందమామరా। ల్దిన్నె
లజేరువెన్నెలలతిప్రమదంబునద్రావిసౌఖ్యసం । పన్నచకోరకాంగనలుభర్తలగూడిసుఖింపుచుం
డన । త్యున్నతశారదాగమమునుత్సుకమయ్యెజగంబులోపలఁ ॥ గీ ॥ ఆశరత్కాలమునభూ
సురాత్మజుండు । పరశివధ్యానచిత్తమేర్పడగనిలచి । చంద్రకిరణంబులనుగ్రోలిసాధువృత్తి । త
పముగావించెజగముమిథ్యగదలంచి ॥ క ॥ జలజలహిమంబురాలగ । కలపంబులుమానిపతులకౌ
గిళ్లనుకాం । తలుబిగియకుచములొత్తగ । చలికాలముదోచెవృద్ధజనబాధకమై ॥ క ॥ తలనెల
గంగయునేడే । డలవడుచలిగర్భజగములలయించునటం । చలికాత్తుడువిసముగ్గిని । గళమున
నేత్రముననుంచెగననిరిబుధుల్ ॥ క ॥ ఆహేమంతంబుననెఱ । సాహసమునగంఠదఘ్నజలమున
నిత్యో । త్సాహంబునశివమంత్ర । వ్యాహారతదపమొనర్చెవైశ్వానరుడుఁ ॥ క ॥ మిసిమిగల
మంచులారగ। పసితేడుచెలంగిఅంకెవైవగకామ ।వ్యసనంబువ్విళ్లూరగ । రసపైశిశిరంబుదోచె
రంజనమీరఁ ॥చ॥ కమలములుల్లసిల్లబిసకాండములంచలుమెక్కచంద్రికా । సముదయమావ

హుల్లగనిశాపతిమింటవెలింగెనాత్మవై । రములుదొలంగిభర్తలనిరంతరమన్మథసంయుగంబులన్ ।
రమణులుతృప్తిజేసిరికరంబనురక్తినితాంతసౌఖ్యతన్ ॥ గీ ॥ అట్టిశిశిరంబులోనగోత్రామరార్య।
కుండునిశ్చలమతితోడకుధరచాపు । వినుతిగావించితనలోనవిసవుమాని । తపముగావించెకర్మ
బంధములుద్రుంప ॥ క ॥ ఈతీరునబుతుషట్కజ । శీతోష్ణంబులకునోర్చిశివపాదాంభో । జాతం
బులెదనునిల్పిని । రాతంకతదపమునర్చెనమరులుమెచ్చన్ ॥ క ॥ ఈలీలదపముసల్పెడు । బా
లుబృహద్భానుగనికృపామతుఁడైదే । వాళిపరిచర్యలెప్పుడు। మ్రోలనుగావించిరొగిప్రమోదము
మీరన్ ॥ గీ ॥ శైశవముమానిమునివృత్తిసలుపుచుండ । పదియురెండేడ్లునిండెనాబహుళకాల ।
ముక్కనిముసముగాదోచెనుర్విదేవ । బాలునకునద్భుతంబిదిపరశురామ ॥ ఆసమయంబున ॥
సీ ॥ జడలకూకటిపైనజాబిల్లిచెలుతున్కమహనీయతరలలామకముగాగ । మేనిపైచిల్వలతేనిసర
ముమిన్కప్రచురముక్తాహారరుచులసీన । వరదాభయదహస్తవనజములపవర్గవితరణచణకల్పల
తలుగాగ । జమునిదన్నినతనచరణంబులత్యార్తరక్షణోపాయపరీక్షదెలుప । నలువవెన్నుడుజే
జేలకొలువుతేడు । మిగులవేల్పులుగూడిరామిత్తిమొత్త । గిత్తతత్తడిరాతసంపత్తులీయ । కోరి
పొడజూపెజడదారికొమరునకును ॥ క ॥ నెనరునజనియబ్బాలుని । తనకరములనెత్తిసమ్మదమ్మున
తొడపై । ననిడితనువునివురుచులొ । చనములువికసింపజూచిసతిపతిబల్కెన్ ॥ గీ ॥ అనఘతా
పసవర్యులకబ్బరాని । బహుతరాయాసపూర్వదుశ్చరతపంబు । జేసితివిదాననేప్రీతిజెందినాడ।
భద్రమగునీకుమృత్యువుభయమువలదు ॥ ఉ ॥నారదుమాటసత్యముగనమ్ముమురిత్తగబోవదెద్దితా।
నారసిజెప్పెనట్లగుగదాత్రుటిమాత్రమునీవుదానికై। భీరుతజెందబోకుముగభీరతగైకొనుమొక్క
టన్వడిన్ । మారకమొందివెంటనసమానసజీవుడవౌదువున్నతిన్ ॥ క ॥ ఎప్పుడునీకాపదయ
గు । నప్పుడెనినుగాతుసంశయమువలదికనే । జెప్పితిచిరజీవుడవై ।తప్పకసురహవ్యములనుదా
ల్పుమువత్సా ॥ గీ ॥ నీవెసర్వదేవనివహంబులకుముఖ । మగుమునీదుకరుణనమరకోటి । హవ్య
ములుగొనంగనర్హుండవగుదువు । సందియంబుమానసమునవలదు ॥ క ॥ ఈపగిదివరములొసగిద।
యాపరుడగుశంకరుండయాచితముగనా । రూపంబులెనిమిదిటనొక । రూపముగైకొనుమటం
చురూఢిగబలికెన్ ॥ క ॥అదిమొదలువీతిహోత్రుడు।మదమునశంకరునియొక్కమూర్త్యంతర
సం । పదగొనిసవనంబులభూ । త్రిదశులచేబూజగొనుటతిరమైనిలచెన్ ॥ గీ ॥ అట్లువైశ్వాన
రునిశంభుడాత్మమూర్తి । గాననుగ్రహమొనరించికదలిచనియె । జూచిసురలెల్లవెరగందిశుచిని
ముఖ్యుడనితలంచిరితమలోనహర్షమొదవ ॥ ఆసమయంబున ॥ క ॥ సురనాథముఖ్యదివిజులు ।
పరమేష్ఠిసమేతులగుచుపరమేశ్వరుచే । వరములువడసినవైశ్వా । నరుగైకొనిజనిరితజ్జనకగృహ

మునకుఁ ॥ గీ ॥ అట్టివైశ్వానరచరిత్రమంతతంద్రి । విన్నమాత్రనెసంతోషవివశుడయ్యె । నబ్జ
గర్భుడుకరుణాంతరాత్ముడగుచు । బాలసింహునకొసగెదిక్పాలపదవి ॥ సీ ॥ పూర్వదక్షిణమ
ధ్యమునసంచితాగ్నేయదిగ్భాగమునసుజ్యోతిష్మతియన । నగరిగల్పించిబాంధవదీప్తిమతులవిశ్వా
నరాఖ్యపితృదేవతలనిలిపి । వారలసంతోషవార్ధిలోపలదేల్చి పరమేష్ఠిముఖ్యులుబల్కిరపుడు ।
మాకుహవ్యములీయమాన్యుండుసర్వహితుండుద్వితీయరుద్రుండితండు । ఘనతనీలోకముననుండి
క్రతుభుజులకు । హితముగావించుననుచుసరేంద్రముఖ్య । దేవవితతులువారికిదెలియబరచి ।
శతధృతినిగూడిపోయిరిస్వపదములకు ॥ అంతనతండు ॥ క ॥ శ్రౌతస్మార్తాగమసం । ఘాతకనై
మిత్త్యనిత్యకామ్యములద్విజ। వ్రాతకృతహవ్యనిచయం। బేతరిదప్పకగ్రహించుచుహితమతితోడఁ ॥
క ॥తనయందేయేదివిజుల ।కనివేల్చినహవ్యమాతడంచుచునాయా। దనుజారాతులకొసగఁ ।
గొనివారుభుజించిప్రియముగోరెదరనఘా ॥ఉ॥ దేవతలిట్లువహ్నితమదేవతగామదిలోననెంచిసం ।
భావనసేయుచుండగసుపర్వులకుఁరణమయ్యెపూర్వదే । వావళితోడనప్పుడుమహాహవమందు
సహాయమూనిదా । పావకుడాదితేయపరిపంథులనెల్లనురూపుమాపగఁ ॥ గీ ॥ బాహుబలమూ
నిదేవతాపరులనెల్ల । సమరమందునచెండాడిజయమునొంది । దేవహర్షముగావించెధీరుడగుచు
సర్వతేజస్కరుండువైశ్వానరుండు ॥ క॥ తనబలతేజస్సులచే । తనుగర్వముజెందిదేవతలనవమా
నిం। పనుదలచియజ్ఞపతినిస ।వనకర్తనుభోక్తనేనవసుధాస్థలిలోఁ ॥శా॥ నాయందుండునుసర్వ
హవ్యములునానాదేవతాశ్రేణికిఁ । జేయన్నేర్తునుజీవనంబులుననుఁజేపట్టినఁగాదెదైై । తే
యుల్ వ్రగ్గిరిసంగరంబుననుసందేహింపనింకేలనే । చాయంజూచిననేనకాదెదివిషత్సంవిజ్జయ
శ్రీయిడఁ ॥ క ॥ ఈవిధమునతనపౌరుష । మేవహ్నినుతించుగానిమీదెరుగడుత । ద్దేవతలస
రకునేయడు. ।వావిరిబాగడుకొనువీర్యవంతులలోనఁ ॥ మ ॥ తనగర్వంబునవైద్యనాథపురమ
ధ్యంబుందువైశ్వానరుం । డనుమానింపకవింటికొమ్ముచిబుకంబందునిమోపెట్టిత । క్కినశృంగం
బిలనుంచిపౌరుషములెక్కింపంగనత్యద్భుతం । బనియూహించెమనంబులోననతడత్యంతప్రమో
దాత్ముడై ॥ చ ॥ అదివినితప్పనర్చననియాత్మనెరింగిమహాగ్రకోపులై । త్రిదివపతిప్రము
ఖ్యులగుదేవతలెల్లశిఖిన్వధింపగా । మదిదలపోసియీశరుడువ్రగ్గినగర్వబలంబులాఉచం । పు
దమనినిశ్చయించిరిస్వభుక్తిగతుల్దిలకింపకెంతయుఁ ॥ క ॥ మోపెట్టివిల్లుబూనుక । నాపగి
దినిప్రేలువహ్నిహరియింపగతా।మోపగలేకసుపర్వులు। కాపట్యముతోడజంపకాలంబరయఁ॥
గీ ॥ శక్తిచాలనిదేవతాసముదయమున । కవుడుగానగనయ్యెముందవనిమీద । కూటమిగవ
చ్చుచెదలనుకీటకములు । వాటిగనివాంఛతోబల్కెవాసవుండు ॥ క ॥ వినుమీరగ్నిధనస్సున ।

గొనయముఖండింపుడంతగూలునుతలగా । పునదేవహితంబుగనీ। పనిసేయుండనగ చెదలుబల్కె-
నతనికిఁ ॥ గీ ॥ ఓయిసురనాథవిన్నపంబొకటికలదు ।. వినుమువరములొసంగనీవేఘనుండ ।
వగుటమే మెచ్చటను ద్రవ్వనచటనుదక । మున్నదునుమామఖంబుననలవరింపు ॥ చ ॥ అనవిని
దేవతాపతిమహాప్రణయంబునబల్కెమీరలే । యనువునభూమిద్రవ్వకొననచ్చటమీమఖమందు
నీరుకూ । డునుగనుపట్టునన్ననుకడుఁబ్రియమందిబిరానకార్ముకం । బునగొనయంబుబట్టదె
గిపోయెసురేంద్రుడుసంతసిల్లగఁ ॥ గీ ॥ అటులశింజినిదెగిపోవనమరవర్య । లగ్నిలోబడెననుప
ల్కునవసరమున । బెట్టుచేకార్ముకాగ్రంబుమిట్టిపడగ । గళముదెగిమింటికెగసిభూస్థలినబడి
యె ॥ చ ॥ తలదెగిభూమిపైబడినతత్క్షణమగ్నినశించెదేవతా । వళులునిరోదనత్వమునవన్నె
దొలంగిరివహ్నిలేకక । ర్మలుచెడిపోయెదానివినిరాజకిరీటుడువైద్యనాథుడా । జ్వలనునిమీదికూ
ర్మినిదివస్పతిముఖ్యులదూలనాడుచుఁ ॥ శా ॥ ఆవైద్యాధిపుశంభుడశ్వినులతానాహూతిగావిం
చియో । హోవిద్యాళికినెల్ల పెద్దయనియాయుర్వేదముఁ దెల్పినే । డీవైశ్వానరమూర్తిమస్తక
ముముందెట్లుండెనట్లుండగా । సేవల్ జేయుడటన్నవారుమదిలోఁజింతించిధైర్యంబునఁ ॥ గీ ॥
శివునివచనముతలనిడికవలుగాన । నశ్వినులుముందుతెగుశిరమన్యమొటి । గూర్చిజీవితుఁ జేసిరికుతుక
మునను । శుచినిపావకుడంతద్విశీర్షుడయ్యె ॥ ఉ ॥ ముందెటులట్లవహ్నిచలముఁ బలమున్నలజీవ
మందిసం । క్రందనముఖ్యదేవతలుప్రార్థన జేయగనెప్పటట్లనిం । పొందగనధ్వరంబులమహో
న్నతిహవ్యములిచ్చియగ్నిమి । న్నందెహరుండువైద్యపతియన్నసుసంజ్ఞనిజంబుదోచగఁ ॥ శా ॥
ఈయాఖ్యానమువిన్నవారలుమనోభీష్టార్థసత్కీర్తిపూ । ర్ణాయుష్యంబులుసర్వసంపదలునిత్యం
బందిరోగంబుల । న్బాయంద్రోతురటంచుభార్గవునకానందంబుగాబోధనో । పాయజ్ఞుండుస
ఖుండుబల్కెనమృతప్రాయంబులౌమాటలఁ ॥ అనిబోధించిజైమినీంద్రుండుమరియు ॥ గీ ॥ పర
శురాముండుగంధర్వపతిసుహాస్త । నామువచనంబువినివైద్యనాథచంద్ర । మౌళినిభజించిసద్భ
క్తిమహిమమీర । నన్యశివలింగమూర్తులనరసిగొలిచి ॥ గీ ॥ రాముడప్పుడుగంధర్వరాజుజూచి।
పలికెమరలంగపుణ్యప్రభవపినాకి । నెనదిగదెల్పితివిమాకునీవుకూర్మి । నదియసర్వజ్ఞనిశదత
నానతిమ్ము ॥ క ॥ అనిపల్కుభార్గవునకి । ట్లనుగంధర్వుండుమిగులహర్షమునపినా । కినికథ
బోధింపనుసాం । త్వనమధురామృతరసోక్తితతులుప్పతిలఁ ॥ ఉ ॥ ఈనదిపుణ్యదాయినినదీశ్వ
రునెచ్చటగూడునంతవ । కైననుమిక్కుటంబగుమహత్త్వమునర్తులవైద్యనాథసం । స్థానము
నుండిసోమశిలశంకరుసద్మముదాకదేవగం । గానదిపోలెగ్రుంకినసుఖంబులుమోక్షమొసంగునే

రికిఁ ॥ గీ ॥ దానితరగలపైఁగాలిదాకిసర్వ । పాపములుబోవునరులకుభార్గవేంద్ర । స్నానమొనరించుమాత్రనెస్వర్గమబ్బు । నత్తరంగిణితీరమందతిముదమున ॥ గీ ॥ హోమపూజలుభక్తిమైనాకృరాత్రి । సల్పతత్తచ్ఛతాధికఫలమునిచ్చు । కలుషరుజలనుమాన్పిసౌఖ్యంబులొసగి ।

## ✻దుర్మదోపాఖ్యానము✻

జ్ఞానవిజ్ఞానములగూర్పజాలుతటినీ ॥ సీ ॥ భార్గవవినుతొల్లిపట్టణంబొక్కటిశ్రీశైలకాననసీమయందు । సిద్ధపురాభిఖ్యచేనొప్పనవ్వీటుపృషధృతుండనుపేరవెలయువిప్రు । డతనిపుత్రుడుదుర్మదాహ్వనుడాతడుధర్మగుప్తుండనుధరణిసురుని । తనుజాతనాత్మగుప్తానామకన్యకనన్వయవిధినిబెండ్లాడియట్టి । యౌవనాంగినిమానివేశ్యలనుమరిగి। మామగారింటిలోపలమసలియాత్మ । సతినిగలయకదుర్బుద్ధిసహితుడగుచు । దురితమార్జించుచుండెనాదుర్మదుండు ॥ క ॥ తనసతినితల్లిగారిం । టనెడించివిరాళినికులటలగూడిమదం । బునవర్తిలునాతడుద్విజు । డనుమాత్రమెకానిపాపమనిదలచడిలఁ ॥ ఉ ॥ ఆవిటచక్రవర్తిజనకార్జితభాగ్యములెల్లదెచ్చివే । శ్యావళికిచ్చికూడగపదార్థమశేషముబోవవారుసం। భావనసేతమానికడుబల్కినవంచనలోనజిక్కితా । నేవిధినైనదెత్తుననియేగెనుమామగృహంబుజేరగఁ ॥గీ॥ మామగారింటగొన్నాళ్లుమసలిమాయ । సతనినూరార్చిబహుభూషితాత్మసతిని । తనదుచెంకికిదెచ్చిఛద్మమునసొమ్ము । లన్నిగొనిపోయివాడువేశ్యలకొసంగె ॥ చ ॥ ధరణిసురుండువేశ్యలకుద్రవ్యమొసంగుతరిన్విధించుత । త్పరిమితిదప్పవారుతమదాపునజేరగనీకయున్నపా । మరతనసూయముఁగొనకమామగృహంబునకేగెనాత్మసుం । దరితనతోడగొంచతిముదంబుననర్థముదెచ్చుకాంక్షతోఁ ॥ గీ ॥ ధర్మగుప్తుండువచ్చినతనయనాత్మ।గుప్తగనుగొనిమదిలోనగుందిమేన । సొమ్ములేమికిమరలవేసొమ్ములిచ్చి । కౌతుకంబుననత్తన్విగారవింప ॥ క ॥ కనుగొనిభూషణయుతయగు । తనభార్యనువంచనమునతనువునగలసొ । మ్మునుహరియింపగమదిదల । చినవాడైకార్యమునకుజింతించివెసఁ ॥ ఉ ॥ కైతవభాషణంబులనుకౌతుకముప్పతిలంగమామతో । నీతులుబల్కిముందుగలనేరములన్నిమరుంగుబెట్టితత । ద్భీతివొలంగజేసితనప్రేయసితానుప్రయాణమయ్యెదు । ర్జాతగుణుండుదుర్మదుడుసత్యవచస్కుడుబోలెమెల్లనఁ ॥ గీ ॥ అతడుసంతుష్టమానసంబావహిల్ల । తనసతినిగూడియింటికిజనగమార్గ । మధ్యమందుననొకచోటమదిరనేత్రి । నిద్రబోవగజూచిదుర్నీతితోడ ॥ గీ ॥ అధ్వగశ్రమనిదురించునట్టిదాని ।వంచనముజేసితమిలోనవాడుసొమ్ము । లన్నిగొనిపోయెసాధ్వినినచటడించి । మన్మధార్తులకిలనుధర్మంబుగలదె ॥ చ ॥ వినయవివేకశూన్యుడగు

విప్రుడుసుప్తనుడస్సియున్నప । త్నినిసటడించిపోవగనుతీవ్రతబెబ్బులివచ్చియూకటఁ । గినిసి
వధించిభ్రమింగెకనుగెంపుననిప్పులురాలనింకనే । మనివచియింపనయ్యెడిమహాత్మకతత్కృతదు
ష్కృతంబిలఁ ॥ చ ॥ తనయులుదుర్మదుండుకుపథంబునజేరిధనంబుగుప్తసా । ధనముగగొం
చువారవనితాతతికర్పణజేయప్రీతిగై । కొనిమితకాలమున్గడపిహార్మిదొలంగగద్రోచివారుమె ।
ల్లననదలింపవాడుధనలాభముజెందనుపాయమెన్నుచుఁ ॥ క ॥ వేరీతులజింతింపుచు । చోర
త్వముజేయదలచిచూడఁధనముజే । కూరమినన్యోపాయము । లారయసామ్మబ్బదయ్యెనన్యులవ
లనఁ ॥ శా ॥ వారస్త్రీలకుశత్రుడైనిజసుహృద్వారద్విజశ్రేణులుఁ । దూరన్వాడుకులంబువా
రలకొగిఁదూరస్థుడైనిందచే ।కూరఁసిద్ధపురంబువేగమునసంకోచింపకఁబాసీదు ।శ్చోరోద్వృ
త్తినిషాదులన్గలసినంజుళ్లఁదినుఁభ్రష్టుడై ॥ గీ ॥ అటులకులగోత్రములుమానియవనిసురుడు ।
నెలుకులనుగూడివేటాడనేగుదొంగ । తనముపిటకృత్యమొనరించుధర్మమెడలి । బహుమృగం
బులహింసించుపాపబుద్ధి ॥ క ॥ తనదేశమెడలియొకదెస । కునుదూరంబరిగిపక్షికులమృగము
లఖం । డనజేయుచుడస్సిపినా । కినితీరంబునకుజేరికిల్బిషపరుడై ॥ ఉ ॥ అన్నదిచెంతదుర్మదు
డహంకృతినెల్లమృగాళిజంపితా ।మన్ననబోయలఁగలసిమార్గముబట్టగడస్సెమృత్యువా । సన్న
ముగాగదీప్తిజెడిసత్వములేమినిమూర్ఛజెందియ । త్యన్నతవృక్షమూలముననుస్సురునఁబడెవా
డుభీతుడై ॥ ఉ ॥ అత్తరిభూమిజాతతటమందునమూర్ఛిలుదుర్మదున్గృపా । యత్తతతోడిబో
యలురయంబపినాకినినీరుదెచ్చిడ । గ్గుత్తుకబెట్టుచుండగనికూరిమిద్రాగుమటంచుబోయగా । గు
త్తులోనికిన్నగముగొబ్బునభ్రమింగుచునీల్గెనాతడుఁ ॥ గీ ॥ పణితుడీరీతినీల్గినపట్లనైవ । భటులు
దివ్యవిమానంబునిటలనేత్రు । శాసనంబునగొనితెచ్చిజడునిదుష్ట । బ్రాహ్మణునిదాననుంచిరిపరశు
రామ ॥ గీ ॥ దేవతలునెక్కనర్హమౌదివ్యయాన । మందునిడుకొనిగొనిపోవనరసికాల। కింక
రులువచ్చియదలించికృతకబుద్ధి । శివభటులతోడసమరంబుజేసీరనఘ ॥ ఉ ॥ శంకరకింకరుల్మి
గులసంగరమందునవారినోర్వగా । సంకటమొందిపాదములనయ్యనద్రావిమహాత్ములారమా ।
వంకమహాపరాధమనివారిజబాంధవపుత్రకింకరుల్ ।శంకవహించియిట్లనిరిసామవచోరచనానుకూ
లతఁ ॥ గీ ॥ ఘనులుకైలాసవాసులుగణవరేణ్యు । లారతపమొనరించినవారికంద । రానిశం
కరపదముజేరంగనర్హు । డగునెకులసంకరబ్రాహ్మణాధముండు ॥ క ॥ ధర్మజ్ఞానులుసుకృతులు ।
నిర్మలతత్వజ్ఞులఖిలనియతులుమానుల్ । మర్మజ్ఞులకుందగుదు । ష్కర్మికినర్హంబెయుండకైలాస
మునఁ ॥ క ॥ అనిపల్కకాలదూతల। కనిరిశివప్రమథవరులుహర్షంబునధ। ర్మనిరూఢిసేయనెప్వ

రి। మనమోపునువినుడిపీనిమహిమము తెలియన్ ॥ ఉ॥ ప్రాణులహింసజేసికడుపాపములన్ గడియిం చెనైననీ । ప్రాణికినంత్యకాలమునపావనమైనపినాకినీజలం। బాణవమాత్రమబ్బెకుసుమాచలశం కరమూర్తివీనిసం।త్రాణముసేయువేట్కనిదితథ్యముసందియమందనేటికిన్ ॥చ॥ కలుషహరంబు పుణ్యఫలకారణమైనపినాకినీనదీ।జలమదిద్రావనెట్టిఖిలజన్మనకైనదొలంగుపాపమీ। తులువయొకిం తగ్రోలెనదితోయమువీడుసమస్తభక్తిమ।త్కులమునమేటితత్వగుణకోవిదుడెన్నదరంబెయేరికిన్ ॥ గీ॥ ఎవడుసద్భక్తితోడుతనీసరిత్తు । స్మరణజేయునుజలమానుస్నానమాడు । నతడుకల్మషముల బాసియాక్షణంబె । శంకరప్రియుడగుటనిస్సంశయంబు ॥ క ॥ ఏయేజనిదురితములకు । ప్రా యశ్చిత్తంబుగాదెప్రతిదినమునుతు । ల్సేయుచుపినాకినీయని । పాయకనాల్గక్షరములుబల్కుట రయగన్ ॥ గీ ॥ థరపకారమఘౌఘముల్దరగివేయు । కలుషములకుమూలమగునునకారమెలమి। కాయనెడువర్ణమొనగూర్చుకామితములు । చరమద్రుతమపవర్గదసరణిజూపు ॥ ఉ ॥ కొం చెముధర్మమున్గలమగోప్యముదెల్పెదమష్టమూర్తులం । దంచితమైననొక్కతనువారయశంభునకీ సరిత్తుతా । చంచలుడైననీనదినస్నానమొనర్చినమాత్రపూర్వపుర్ । సంచితపాపముల్దొలగి శంకరరూపముదాల్చువేడుకన్ ॥ గీ ॥ జన్మములదానములతపస్సాధనముల । నందజాలరుశివ రూపమఖిలజనము । లీపినాకిలోగ్రుంకనెవ్వారేని । శీతకరధారులగుదురుదూతలార ॥ ఉ ॥ కానసరిజ్జలంబునిజకర్మములన్ దొలగించిపుణ్యవి । జ్ఞానులజేయుమానవులసత్యముబల్కెడమీన దీపయః । పానముసేయుటన్ ప్రబలపాపములన్ దొలగంగవీడుపు । ణ్యానుభవానుకూలుడ యిహవ్యథుగక్షపదంబుజేరెడిన్ ॥ గీ ॥ ధరణినాచంద్రతారకస్థాయియగుచు । నితడుకైలాస మునసుండునేమశంభు । సన్నిధికివీనిజేర్తుముశంకమాని । మీరుయమపురికేగుడక్రూరులగు చు ॥ క ॥ ఈరీతికృతాంతభటు। క్రూరత్వమడంచిబానిగొంపోయెదున ; ప్పారిషదులశాసనము న । వారరిగిరిదండధరునివసతికిరామా ॥ ఇవ్విధంబున ॥ క ॥పలికినసుహస్తుబోధను । దెలియ గవినిభార్గవుండుతృప్తుండయియ । వ్వలికథజెప్పుమటన్నను । కలితామోదంబుతోడగంధర్వు డనున్ ॥ వ ॥ అనినైమిశారణ్యవాసులకుజైమినిమహామునీంద్రుండుచెల్పుటయు ॥ శా ॥ స్వ ర్గోభోగాధికసౌఖ్యధామవిగతాశాసంచరద్దేవరా।ణ్ణిర్భీకృన్మహితప్రతాపకనదగ్నిజ్వాలవద్ధస్త్రరు। ణ్ణిర్భిన్నాత్మహృదాశరాత్మజమనోనీరేజతేజోనిధీ । గీర్భామాధవసన్నుతాత్మచరితాగీర్వాణసం సేవితా ॥ ఉత్సాహ ॥ కర్మబంధమోచనాశుకప్రముఖ్యమౌనిరా। ణ్ణర్మతత్వవాగ్విచారణప్రభా వభాసురా । ధర్మపుత్రదారవస్త్రదానహేతువిస్ఫుర।ద్ధర్మభావపుష్పశైలధామచెన్నకేశవా ॥

క॥ పత్రీట్పుత్రగబహుపా । త్పుత్రశయానారమావిభాసురజలరు । ణ్ణేత్రాతప్తహిరణ్మయ । సే
త్రాకమలాకళత్రనీరదగాత్రా॥ గద్య ॥ఇదిశ్రీమన్మేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధకవితానైప
ధ్యవేమనారాధ్యముగ్ధసంగేశ్వరపుత్రకౌండిన్యసగోత్రపవిత్రశివానుగ్రహానుషంగశ్రీకాళహస్తి
లింగవిరచితంబగుపుష్పాచలఖండంబనుమహాపురాణంబునందు పరశురాముండుగంధర్వపతియైన
సుహస్తునిగూడిపుష్పగిరిప్రవేశించుటయునచ్చటతత్వజ్ఞానసనాథశ్రీవైద్యనాథసందర్శనంబునుత
త్తత్పూజావిధానంబును వైశ్వానరచరిత్రంబును దుర్మదుండను బ్రాహ్మణుండపవర్గంబుబొందుట
యుపినాకినీసరిత్ప్రభావంబునుగలద్వితీయాశ్వాసముసంపూర్ణము॥ * * * * *







శ్రీరస్తు.

# పుష్పాచలఖండము.



## తృతీయాశ్వాసము.

శ్రీవనితామానసరా। జీవమధువ్రతసమానజితదానవస । ద్భావాధృతవనమాలా । గ్రీవా పుష్పాద్రిచెన్నకేశవదేవా ॥ దేవావినకటాక్షింపుము శౌనకాదిమునులకు జైమినిమహామునీంద్రుం డిట్లనియె॥ క ॥ మునులారవినుడుభార్గవ । మునియచ్చెరువందిమిగులమోదమునపినా । కినిమహిమసమగ్రముదెలి । యనునెచ్చెలిజూచియిట్టులనెమధురోక్తిన్ ॥ ఉ ॥ పాపగదాపహారియ నిబల్కితివీవుపినాకినీనదిన్ । కాపురుషుండుదుర్మదునిగాథయెదెల్పఘాళిద్రుంపగా । నోపుఁట రోగముల్దొలగియుత్సుకమెవ్వరికబ్బజెప్పవి । ద్యాపరిశీలయన్ననుసుహాస్తుడుభార్గవుగాంచియి ట్లనున్ ॥ గీ ॥ రాముపినుతొల్లియుండుస్వర్గంబువిడిచి। తపముసేయనగస్త్యుండుదలచిహిమవ। దగవనంబునగల్పించెనాశ్రమంబు । నుగ్రుపైచిత్తమిడిపావకోపముండు ॥ చ ॥ అటతపమాచరింపుచుమహాపగగాదలపోసిభూమిభృ । త్తటముననుండివచ్చిమితిదప్పకనిత్యముజల్కమాడిపి। మ్మటతనప్రాతరాహ్నికముదుర్చిపినాకినినీరునింపిత । ద్ఘటముకరంబునూనిప్రతిఘస్రమువచ్చునగంబుజేరగన్ ॥ గీ ॥ అతడుస్వాశ్రమమందుమధ్యాహ్నవేళ । నప్పినాకినినీటశివార్చనాగ్ని। భూతబలులనుదినముతపోవిభూతి ।పటిమనొనరించుచుండునుపరశురామ॥ ఉ ॥ అమ్మహనీయుడిట్టులుగనన్వహమున్మితిదప్పకుండగా । లమ్మునపీతిహోత్రవిధులన్ పరిపూర్ణముసేయునెట్లుశా । స్త్రమ్మునజెప్పనట్టులెకరంబనురక్తిననొక్కనాడుపూ । ర్వమ్మువలెన్ జలంబుగొనివచ్చుచునుండెనుసత్వరంబుగన్ ॥ గీ ॥ అటులకాలంబతీతమాననుచువచ్చు । సంయమికిగల్కనధికాల్పశంకబాధ । మహితవింధ్యాద్రికాంతారమధ్యమునను । దైవయోగంబునేమనిదలపవచ్చు ॥ గీ ॥అనఘుడుశుచివ్రతుండుకాలాతిగమన । మగుననిభయంబుచేగుందియటవిలోన । హస్తమందున్నకలశంబునందుకొనగ । నెవరులేకుంటతనమదినెరిగివగచి ॥ ఉ ॥ ఎవ్వడుగానరాడుదిశలెల్లనుజూచినమాత్రబాధకిం । కెవ్విథినీటికేమరలనేగనశక్యముక్రిందనుంచరా । దివ్వనమందుపాత్రమువహించుకమాత్రముసేయగూడదిం । దెవ్వనిచేతికిత్తమననెవ్వడులేడుమదన్యుడివ్వనిన్ ॥ మ ॥ అనిచింతింపుచునమ్మహామహుడుమాత్రార్తిన్ దెసల్ జూడగా । గననయ్యెన్గజవక్త్రుడద్రివరసంకాశస్ఫురన్మూషికా । గ్రణిపైనెక్కిబలారివీడుగనవేట్కన్ బోవు

జ్ఞ । సూత్రగిరిశబృహద్భానుశుక్లభీమ । హారిముక్తాట్టహాసస్వాహాస్వరూప । కాలహరదం
ష్ట్రికోనునమస్కారతతులు ॥ గీ ॥ భైరవాకారకాలరూపప్రకాశ । త్వష్టృటాయవికాసతీర్థపపశు
పతి । వ్యోమరూపకవ్యోమేశయోగమూర్తి స్త్రీపురుషగాత్రయజనుతుల్జేతునుభవా ॥ గీ ॥ దే
వచిహ్నాంబదైవేశ దేవదేవ । శరవణోద్భవజనకయోగసవననాథ । బ్రహ్మచారిమృగవ్యాధబ్రహ్మ
భర్త । విశ్వమోహనభవయోగివినుతిగొనుము ॥ గీ ॥ యోగయోగీశ్వరేశ్వరయోగగమ్య ।
మంత్రభర్తకపాలిహంసస్వరూప । ప్రాణిపాలనజ్యోతిషాంపతిగిరీశ । మాటిమాటికిజేతుముకోటిన
తులు ॥ అని ॥ ౫ ॥ ఈకరణిఁ బ్రత్యక్షులై కొనిసప్తర్షులనుతులుగావించిరిసుశ్లోకునిశంకరదేవుని ।
లోకసులానందరసము పొందినతులగుచుఁ ॥ క ॥ పరమాత్మభక్తవత్సల । గరకంఠాసమికుసేవగావిం
పగనీ । గిరినుందుమమిరంగీ । కరణముసేయంగవలయు కారుణ్యనిధీ ॥ చ ॥ అనవినిశంభుడిట్లనుమ
హాత్మకులారపదాజ్ఞబూనిమీ । రనయముస్వస్థులైదనరియంశమునిచ్చటనిల్పిభక్తితో । ననుదిన
మాశ్రయించిమమునర్చనజేసిమదంతికస్థలం । బుననివసించుడన్నమదిబాంగియొడంబడిరందఱత్త
ఱిఁ ॥ మ ॥ గదగేలంధరియించిపార్శ్వమునదార్ఢ్యస్వామిపైనెక్కియుత్ । ప్రదుడైనిల్చినకేశవున్గ
నికృపాపాథోధిగౌరీశుడిం । పుదలిర్పండగుమన్ననల్సలిపిసంపూర్ణానురాగంబుతో । మదికాహ్లా
దముసేయగాబలికెవాక్ప్రాధుర్యచాతుర్యతఁ ॥ క ॥ వెలుగొక్కటియేయీజగ । ములుసృష్టియొ
నర్చుద్రుంచుబ్రోచుతదీయం । బులగుత్రిగుణంబులుముకద । జలజభవుండేనునీవుసారసనయనా ॥
క ॥ త్రిగుణములొక్కటియగుదుము । తగుపేళలవేఱువేఱదనరుదుముగదా । భగవంతులమ
గుమనలో । నగునే భేదంబుబుద్ధినాలోచింపఁ ॥ సీ ॥ ఇయ్యవె వేదంబులేపునదద్ధర్త సోమకు
ద్రుంచిపితామహునకు । నిల్పవేమూపునసీరధిగ్రుంగుమందరగిరిదేవతాతతులుమెచ్చ । నెత్తవేభువి
మహోన్మత్తుహిరణ్యాక్షులీలహరించిలొల్లింటిపగిది । మనుపవేప్రహ్లాదుకనకకశిపుజీరిస్తంభసంభవ
నృకేసరితనొంది । బలినిద్రొక్కవెరాజులబలములడప । వేదశౌనను ద్రుంపవేవెడగుకంసు । జంపవే
పురసతులమోహింపజేయ । వేకలిక్రూరులనుగూల్పవేమహాత్మ ॥ క ॥ ఒకదేవరూపములమని । ప్ర
కటింపవెశ్రుతులువాటిపద్ధతులనెఱుం । గకమూఢులుమనకిద్దరి । కొకభేదముగలదటంచునూ
హింతురిలఁ ॥ శా ॥ వైకల్యాత్మకులౌటగాకమనకుఁ వాక్రువ్వభేదంబెలో । కైకత్రాతలమై
ననన్నునినునేయేరీతిభావింపనం । దేకారుణ్యముగల్గిబ్రోచెదముసందేహంబులేదింకనీ । వీ
కుభ్రంబుననుండునానికటమందిందీవరశ్యామలా ॥ అనిమరియు ॥ క ॥ ఇదిమొదలుకొనిపినాకి
ని । నదిలోపలజలకమాడిననునినుజనముల్ । మదినిల్పిపూజజేసిన । సదమలసాయుజ్యపద
విసమకూరునిలఁ ॥ క ॥ మనమునజపతపములగుం । దనుపనియేమిటికిభక్తిదప్పకమనలఁ ।

గొనియాడుసరుసకబ్బదె । ఘనమగుబ్రహ్మైక్యపదవికంజదళాక్షా ॥ మ ॥ కలికాలంబునసీమ
హాత్త్వమిలనిక్కంబెక్కుడైచెల్లునీ । నెలవందుండుగదాధరాఖ్యతనుసందేశంబుగైకొమ్ముముం ।
దలఘుత్వంబగుచెన్నకేశవసమాఖ్యానంబుచేదివ్యపూ । జలుగైకొందువుమానససమ్మతముకంజా
తాక్షనారాయణా ॥ గీ ॥ అస్మదీయాంఘ్రియిచ్చోటనలరెదీని । దక్షిణంబునయుష్మత్పదంబు
నిల్పి । యఖిలలోకములకుముదంబావహిల్ల । లక్ష్మితోగూడియుండువిలాసమొప్ప ॥ గీ ॥ అని
ననొడబడెనామాటకచ్యుతుండు । గౌరవంబొప్పవిష్ణుశంకరులుగలసి । సకలజగములకిష్టార్థ
చయమొసంగి । రనఘశివకేశవులకుభేదాప్తిగలదె ॥ ఉ ॥ అంతటవిష్ణువున్మనసిజారియునర్మిలి
భక్తకోటికి । త్యంతశుభంబులిచ్చుచుదయాపరులైముదమందిరప్ఘుమా । రాంతకుడబ్జయోని
గనిహర్షముతోడహిరణ్యగర్భునా । చెంతసునిల్చిసౌఖ్యములజెందుమఖండమహాత్త్వమొప్పగన్ ॥
మ ॥ అనివిఘ్నేశునివీరభద్రునిగుమారాహ్వానునందీశుసూ । ర్యునిజండిన్ శుచిసప్తమాతృగణసైె
లోద్భూతలన్ బిల్చిమీ । రనయంబందటుతారభూధరమునంవాసక్తితోనుండున । ట్లనుమోదం
బుననిగ్గిరీంద్రమననిత్యంబుండుడీవేడుకన్ ॥ క ॥ అనిభైరవుబిలిచిమృదూ । క్తిననసెసీశైల
మునసిధివ్రజమునుని । ల్పినవాడనష్టదిక్కుల । కనుమఱుగకయుండునడుమకావలిగాగన్ ॥
క ॥ అనవనిధిరక్షకుడవు । గానీవుండుటయమేలుకాదనవలదే।మానవుడునిధులుగలవని। తా
నెతిగినబలిమిగొనుటతథ్యముసుమ్మీ ॥క॥పలువరుసయాడినసుత్మ।శ్రులురాలినసొమ్ముబ్రతుకుసో
యగములనా । సలుపూనరవియునిలవని । తెలియరుమూఢాత్మజనులుధీరవిచారా ॥ క ॥ గ
శగతజీవుండైనను । నెలకొనువిత్తాశవదలనేరడుప్రాణం । బులువిడజాలనివైనం । దొలగించు
ధనాశదొలగద్రోయండనఘా । గీ ॥ కలిమిజగతికిమూలమక్కలిమిగలుగు ।వానిసుమతిగజేరిజీ
వనముజేతు । రర్థహీనులుశ్రోత్రియులైనసర్వ । పండితులుస్వాపతేయాశపరులుగారె ॥
చ ॥ కడబడుమాత్రనేస్పృహనుగాంచెదరీధనమొక్కడైననా ।ల్లననితొలంగిపోడుకడులంపటు
డౌనటతజ్ఞుడైననె । వ్వనికధనంబుగల్గుభువివాడుపవిత్రుడుబాంధవాప్తస । ద్వినయుడుపూరు
షోత్తముడుపెత్తమహాత్ముడతండెభైరవా ॥ క ॥ ధనమేజ్ఞానినివిద్వాం । సునిబ్రహ్మవిచారినై
ననొకుడువశివం । చనసేయుగాననేమఱ । కనుసీవిందుండికావగాదగుదృఢతన్ ॥ గీ ॥ అని
సశివునాజ్ఞమస్తకమందునూని । భైరవుడుచెప్పినట్టులెప్పకవసించె । జాగరూకతకాశికాస్థాన
మందు । ప్రబలికాపున్నచాట్పునబరశురామ ॥ గీ ॥ అమృతపుగొలంకులోనసీయద్రిపుష్ప । రీ
తిదేలినకతనసీపృథ్విలోన । పుష్పగిరినాగనాఖ్యఁబెంపునువహించి । యఖిలదేవనివాసమైయల
రునిపుడు ॥ క ॥ అమృతమనునామమాత్రం । బమరినతక్రమునదేలునటువెన్నయొచి । త్రమె

ఱయొకగిరితేలుటది । వ్యమహామృతసరసినడుమనబ్జములీలన్ ॥ క ॥ ఈపుష్పగిరిసదాశివు । డాపదలనుబాపుగాననర్చించుదయో । ద్దీపితుడఘములదోలున్ । జేపట్టుననిన్నురక్తి చేశ్రీఘమునన్ ॥ వ ॥ అనియానతిచ్చెనని జైమిని నైమిశారణ్యవాసులకుమఱియు నిట్లనియె ॥ క ॥ పూర్వోక్తరీతినాగం ।ధర్వుండాతనికిదెల్పుదద్భుభమీభృ । త్సర్వశివాలయములగల । శర్వులఁ జెప్పె ఱనడుగ సమకట్టియనెన్ ॥ గీ ॥ ఓమహాత్మ సుహస్తయుమామహేశు । మహిమవినగోరెదను జెప్పుమాయటన్న । వినిసెనరుమీఱనాతడిట్లనియె నంధ । కాసురవిరామచరితమాద్యంతముగను॥

## ఉమామహేశ్వరచరిత్రము.

మ ॥ ఖలుడైయంధకనామకాసురుడహంకారంబుదీపింపలో । కులలోకంబులదేవతామునులఁబై గ్రోధించిహింసింపనా । పొలదిండిన్బరిమార్చిక్రమ్మఱిలసత్పుష్పాద్రిహర్మ్యాంతర । స్థలికేతెంచిభవానికానబడమిన్ జాలన్మదిన్ గుందుచున్ ॥ గీ ॥ అద్రిసుతచెలులైనజయయునువిజయ । యసైడువారునులేకున్నభవుడాత్మ । జింతజేయుచునుండియేకాంతమందు । తరుణిపైమోహమునను గాతరతజెంది ॥క॥ తడవాయెనరిగిరాడని । సుడిబడివిరహార్తిగుందిసోత్ప్రాసమునన్ । బడతుకడాగినదనుచున్ । గడుమదినిశ్చయముజేసిగరగళుడంతన్ ॥ వ ॥ అగ్రతనయుండగుగణపతినిరావించియిట్లనియె । గీ ॥ తండ్రితావకజనయిత్రిదాగనోపు । నచ్చటచ్చటసీలోకమంతవెదకి । వేగముగదోడితెమ్మనవిఘ్ననాథు । డాత్మవాహముపైనెక్కియరిగెగూర్మి ॥ ఉ ॥ అంతటనంతటన్వెదకనద్రితనూభవగాననయ్యెవి । ఘ్నాంతకుడంతసంతసిలియంబకుమ్రొక్కిననాత్మజున్ గృపా । స్వాంతతనాదరించివినయంబుననిట్లనునన్నగొంచుబో । భ్రాంతినదండ్రిపంపగనుపజ్జకువచ్చితివేమిపుత్త్రకా ॥ఉ॥ ఐననుసేభవజ్జనకునంతికభూమికిసీవుబిల్వగా । రానుమదాజ్ఞనీవరుగురాజకిరీటునిజేరనన్నద । త్తానుడుదల్లినిన్నిచటద్రోచివగన్ జనజాలగాననే । నీనికటంబుననిన్నిలచినేర్పునసేవలొనర్తుశాంకరీ ॥ గీ ॥ ననునిచటనుండనియమింపుమనినగౌరి । యొప్పిసామజముఖుదనయొద్దనునిచె । నంతపుష్పాద్రిపైనబురాంతకుండు । దడవుజేసెనురాడేకదంతుడకటా ॥ మ ॥ అనిచింతించిగజాననుండచటనంబాజ్ఞన్మదిన్ బూనిచెం । తనుసేవల్పటియింపుచుంటతనయాత్మన్ గాంచిపాయంగజా । లనిమోహంబునపేరభ్రమగనియుల్లంబార్తిబీడింపని । ట్లనియెన్సార్ద్రవభాషణంబులనునెయ్యంబాత్మనుప్పొంగగన్ ॥ గీ ॥ తండ్రిమీతల్లికైలాసధరణిధరము । చెంతదపమొనరింపగానంతరాయ । పతినిదోడుకరమ్మనిపంపినాడ । నతడుర్వాడయ్యెసతిజాడనరసిమఱల ॥ క ॥ కావునజననిన్ దోట్కొని । రావలెననిసుతునిబంపరాజితగిరికి । స్వేవేగబోయినగసీ । మావనమునదపముసేయుమాతనుగనియెన్ ॥ క ॥ అం

బాసన్నిధిశుశ్రూ । షంబల్మిఁబు జేసీభక్తి సరణినిలుచుచుహే । రంబునిగిరిజనుగనిమో । దంబునవీరే
శుడనియెడండంబిడుచుఁ ॥ గీ ॥ తల్లి కుశలంబెమాతండ్రిదయదలిర్ప । మిమ్ముఁజూచుట్కానిరమ్మ నె
నమ్మయనగ । నతనిపల్కాలకించిరోషాత్మయగుచు । నూరకుండినవీరేశుఁడుత్సుకమున ॥ క ॥
జననిసహింపనికోపము । గనియిచ్చటనుండననుఁగరుణింపుడనం । గనువల్లేయనుశాంభవి ।
పనుపునసంతసిలివీరభద్రుడుఁనిలచెఁ ॥ అటమహానటుండు ॥ చ ॥ ఘనుఁడగువీరభద్రుడటుకా
లవిడంబము జేసెనింక నే । మనశుభవార్తనేనజనిహర్షముదోపగగాంతనిప్పుతో । ట్కానియిట
వచ్చువాడననిగోపతివాహనమెక్కిశీఘ్రితఁ । జనియెబినాకపాణినిజసాధ్వితపంబొనరించుచో
టికిఁ ॥ క ॥ వీరేశుఁడుగణనాథుం । డారసిశుశ్రూష జేయనత్యంతతప । శ్చారిణిగోపాన్విత
యగు । గౌరినిగనిడాయనరిగిగరగకుడనియెఁ ॥ఉ॥ ఏలనిరస్తభూషవయియివ్వనమందుదపం
బుసేయనో।బాలశిరీషసూనమృదుభాసురదేహముపృష్టికామరు। తీక్ష్ణమహోష్ణతండములతీవ్ర
తకెట్టులనోర్చెనేచలం । బాలలితాంగిమమ్ము నెడబాసివసింపగతంబదేమొకో ॥ ఉ ॥ ఓమృగ
చంచలేక్షణమహోన్నతకోపతలోచనాష్ఠమ । శ్నేమముదప్పివ్యత్యయతనేత్రములారుణావృ
త్తివాటెఁ । శ్యామలశుక్లకాంతులనిజంబుగడెందెజలింపకేతపం । జేమిటికాచరించెదవహో
హేతువుదెల్పగరాదెమానినీ ॥ క ॥ లలితేందివరశయ్యా । స్థలమునహరినీలబద్ధసౌధాంతర
మం । దలరుంబోశిరోనాతో । గలయవెనీవానిదాఘకాలములంచుఁ ॥ క ॥ మానకనుపద్మ
రాగా । స్థానశిరోగృహములందుజతగూడితమిఁ । సూనాస్త్రకేళిలోపల । వానలతడిసె
న్నగలయవావనజాక్షీ ॥ క ॥ ఓరమణిరాజభర్మవి । కారోమ్మలశశకరోముకంబళశయ్యా।
గారంబులజలిలోనను । గూరిమితోఁగాగలించుగుణమెందరిగెఁ ॥ క ॥ ఈరీతినుండియొంటిగ।
జేరియడవినడుమనిట్లు సేకష్టపడఁ । గారణమ దేమినాయెడ । నేరముగల్గినశమింప నేరవెతన్వీ॥
చ ॥ ననువినవాడియన్కిఁదగునావినునాయెడదప్పులున్ననీ । మనమున నెయ్యముానుమభిమా
ననుఁగల్గెనుందునాపయి । న్గినుకవహింపనేలననికేలుదెమల్చుచుగౌగలించెన । మ్మనసిజవై
రిభార్యనుసమంచితగాఢతరానురాగతఁ ॥క॥ రమణికపోలయుగంబున । గ్రమమునమకరికలు
వ్రాయగిలకరమననే। ర్చపరచిబుకంబుబుడుకుచు । రమణినిబలిమాలెమిగులరక్తిఁనగుచుఁ॥
క॥ అసలితనభర్తనుప్రియ। భాసురయైకౌగలించెభావములోదా। నీసడచిదేవమందుభి । ప్రొ
సెఁదినిసురలుపుష్పములుగురిసిరోగిఁ ॥చ॥అలరులవానదుందుభిమహాధ్వనులొప్పనుమామహేశు
ల। న్వలగొనిప్రొమొక్కుచుఁసురలవార్యనుతుల్దగజేసిదేవచే। వలలితమూర్తిశంకరశివాహ్వదయే
శక్నపామయాకుతూ । హాలమునమిమ్ము మేమొకటియాచనజేతుమటంచువేడురఁ ॥ఉ॥ ఈవిధి

మీరలిద్దఱిల నేకతభక్తజనాళికెట్లు దృగ్గ్భాచితులై తిరోయటులకన్నులపండువుగా గభక్తివ శ్యేవకమాంమకాదులకుజిత్తమురంజిలజేసియుండిమీ । సేవలోనర్చువారలక శేష.సుఖంబులొసంగగా వలెఙ్ ॥క॥ సిరులఖిలభోగములుశుభ । కరులగుపుత్రులనొసంగగావలెననశం । కరుడట్లఁ జె:ఁ నని సుర ।వరులకభయమొసగెబూర్ణవాత్సల్యమునఙ్ ॥క॥ సదయుడుభక్తోక్తులుతన । మదికాహ్లాదంబుసేయమహిమనతండీ । సదనమునలిచెశంభుం । డదిమొదలునుమాంమహేశ్వరాఖ్యలెవె. సెఙ్ ॥ గీ ॥ సాధ్వీసంతోషపడితనసఖులవిజయ । జయలరావించియాపుష్పశైలకటక । మం దునిద్దఱనాకరూపమైవెలుంగ । దుర్గయనుపేరనిలిపెనిరర్గళముగ ॥ శా ॥ ఆడుర్గాంబమహానుభావవిబుధస్వాంతస్థకాత్యాయనీ । ప్రాదుర్భావయుగానలోకములుసంభావింపనైశ్వర్యపు । త్రాదుల్భక్తులకిచ్చినిత్యమునుబుష్పాద్రీంద్రవాసంబుస । న్మోదంబొప్పగ జేసెసేవకులకంపుల్మీఱగా భార్గవా ॥ గీ ॥ ఇవ్విధంబునగావించిహితముమీఱ । దమరువృష.భాధిరూఢులై తనరిపుష్ప । శైలమునసిటనిల్చిరిసంతసమున । బరమకారుణ్యధాములైపరమశురామ ॥ క ॥ చదివెడువారికివినియెడు । సదమలజనములకుమిగులసౌఖ్యముమత్సం । పదలిడజాలెడుసత్కథ । యిది యనిగంధర్వుడనియెహితముదలిర్పఙ్॥అనిమఱియు॥ఉ॥జైమినిబల్కెగౌరవతశౌనకముఖ్యులకిట్టులాసుహృ।ద్గ్రామణిసూక్తులఙ్బ్రియముగాంచినిరంతరసౌఖ్యమియ సి।నోముచరిత్రజాల ఁవి పుష్ప డనైతినటంచునాత్మలో ।రాముడుమామహేశ్వరుబరాత్పరుసన్నుతిజేసెరక్తితోఙ్ ॥ క ॥ ఆ రాత్రిగడపివేగిన । నారాముడుభక్తిబ్రాతరాహ్నికవిధులఙ్ । దీరిచియాగంధర్వుకు । మారుసుహస్తాఖ్యుగాంచిమఱియిట్లనియెఙ్ ॥ గీ ॥ అనఘయిచ్చటిదేవుమాహాత్మ్యమీవు । జెప్పనర్హుడవనభృగుశేఖరునకు । నాసుహస్తుండుబల్కెమహానుభావ । తెల్పెదనువినుశంకరదేవుమహి



## ✳సంతానమల్లికార్జునచరిత్రము.✳

మ ॥ క ॥ సంతానమల్లికార్జున । కంతుహరుండిమ్మహాత్మ్యకథముందుగనీ । స్వాంతమురంజిలజెప్పెద । సంతానద్రుమమపుత్రసముదయములకుఙ్ ॥ సీ ॥ పూర్వకాలంబునబుండరీకాక్షునిబొక్కిలితమ్మినబొడమెనలువ । యాచతురాననుండఖిలసృష్ట్యర్థమైమనమునసృజయించెదనయవరుల । నలువురసనకాదినామకులనువారునిస్పృహభావతనెగడితత్వ । నిష్ఠులగుటగాంచినీరజాసనుడంతబుత్రులదొమ్మండ్రబుట్టజేసె । వారుతనకుసమానులవార్యతేజు । లసములుమరీచిభృగువంగిరసుడుమరియు ।ఘనపులస్త్యుండుపులహుండుక్రతువుదక్షు।డత్రియువశిష్ఠుడననొప్పుహర్షమతులు ॥ క ॥ వారలలోనద్వితీయకు । మారుడుభృగువతులతత్వమతితాపససం । చారియుస్వాధ్యాయపరుం ।డారయరెండవగిరీశుడనజనుభువిలోఙ్ ॥ చ ॥ అతడుకుమారుగోరివినయంబునశ్రీగి

రికేగిపార్వతీ । పతియగుమల్లికార్జునుదపః ప్రియుగూర్చితపంబునుగ్రతఁ । శతపశదివ్యవర్షము
లుసల్పగశూలిప్రసన్నుఁడయ్యెద । త్ర్యక్షతురిపుగాంచిమ్రొక్కికుతుకంబునసన్నుతిజేయనూల్కొ
నెఁ ॥ క । పలుకనునిర్దేశింపగ । నలవడనక్షరతచిన్మయాకృతివిమహా । త్కలితుఁడవుజ్ఞానసా
ధ్యుఁడ।వలరెదువిజ్ఞానగమ్యమగురూపమునఁ ॥గీ॥ నీవెవెలిగెదవంతటనిర్గుణతని।రంజనావ్యక్త
మహిమావిరాజివగుచు।ననఘకులనామములులేకనలరెదిట్టి ।నిన్నుశరణంబువేఁడెదనిటలనయన॥
గీ ॥ ఎద్దిసర్వసాక్షియెద్దిచైతన్యంబు । ముఖ్యమైశ్వరంబుమునిజనముల । కంపజింతసేయనల
విగానిదియెద్ది । దానిసేభజింతుమానసమున ॥ గీ ॥ ఎద్దినిష్కళంకమెద్దినిర్లేపంబు । సంతదా
ననిండియాత్మదృష్టి । గాంచనెల్లచోట్లగన్పట్టునద్దివ్య । శాంభవంబుమదినిసన్నుతింతు ॥ క ॥
వ్యక్తావ్యక్తగుణాత్మక । శక్తిప్రియవిశ్వరూపశర్వయనంతా । ముక్తిదనతిగోనినన్న । వ్య
క్తునిరక్షింపుమల్లికార్జునలింగా ॥ చ ॥ అనినుతిసేయునాభృగునకాపరమాత్మసదాశివుండుపా।
వనుడుద్రిలోచనుండగుశివాపతిశంకరుఁడవ్యయాత్ముఁడి । ట్లనియెగృపాసమేతపరహాసముఖాబ్జమ
నంతవైభవం । బునజిగురింపరక్త్యమృతపూర్ణసుభాషణమాదరంబునఁ ॥ సీ ॥ ఏభక్తినాయం
దుదృఢవృత్తినిల్పిసన్నుతినన్నుజేతువోవ్రతముబూని । యదినీకునిష్టార్థమగునట్లుజేయునుసంబి
యపడనేలసంయమీంద్ర । నవరత్నమయపుష్పనగమునకేగియచ్చటనుమన్నామకసంజ్ఞలింగ ।
సంస్థాపనముజేసిసరగబినాకిసీస్నానంబుముమ్మాఱుసలిపిప్రతిద । నంబునీరీతినొకవత్సరంబుజరు
పు । మఖిలసద్గుణనిధియగునాత్మజుండు । గల్గుననుపల్కెశ్రీమల్లికార్జునునకు । ననియెభృగువు
కుతూహలాయత్తుఁడగుచు ॥ గీ ॥ భక్తవత్సలజగదీశపరమపురుష । దేవశంభరహరమహాదేవమీ
ర । లచటికరుదెంచుడఖిలలోకాభిహితమ । టన్ననటుజేతుననెమల్లికార్జునుండు ॥ చ ॥ అస
భృగువీవెసాక్షివిగణాధిపనీకునమస్కరింతుపా । వనమునులారఘూఘరనివాసితదేవతలారమీర
లీ । మసనిజవైరియాజ్ఞయిడుమాటలకండఱుసాక్షులౌచురం । చనిఘనుతుష్టిటించికుసుమా
ద్రికినేగెదృఢానురాగతఁ ॥ క ॥ చనిభృగువచ్చటనుపినా । కినిజలములనాడిపుష్పగిరిపై
లింగం । బునుమల్లికార్జునాఖ్యత । ఘనుడుప్రతిష్ఠించెభక్తికలితుండగుచుఁ ॥ ఉ ॥ చాలగ
మొన్నతమ్ములనుచంపకజాతులతుంగబిల్వప । త్రాళులమల్లిపుష్పవులదిలాక్షతలఁసనుకూర్చిపా
ర్వతీ । లోలునిబూజసేసెదనలోనుతియింపుచురుద్రసూక్తులఁ । వ్యాళకలాపధారికనయంబు
ప్రియంబగునట్టుభార్గవా ॥ క ॥ దధిమిశ్రాన్నముకాంచన । పృథుపాత్రికనుంచిశృంగిబేరద్రా
క్షా । గ్రంథితంబుగననుదినముఁ । మధురాహారంబుశివసమర్పణజేయుఁ ॥ క ॥ ఈరీతిచ
తుష్టయ్యాప । చారంబులసాంబమూర్తిసంతోషింపఁ । ధీరతనొకవర్షంబును । ధారుణిధరశృం

గమంచుతపమొనరించెన్ ॥ క ॥ స్తుతిసేయుటకారభిం। చితపసివేదాంతసూక్తిచేనిట్లనియెన్।
సుతుగోరిమానసంబున । జతగూర్పడెనాదుకోర్కి శంకరుడనుచున్ ॥ క ॥ దేవవిశ్వేశశాం
భవ ।పావనవిశ్వప్రకాశభారావహని।స్సేవించెదనుద్రినేత్రా ।నావందనమిదిగొగొనుమునందితు
రంగా ॥ క ॥ ఫాలాక్షశక్రముఖసుర । జాలమునీపాదసేవసల్పుచుజగము । ల్పాలింపగోరబ
రమచ । యాలంబనమూనియివ్వవాయాకోర్కుల్ ॥క॥ఓసాంబతావకీయో । పాసకులనుబ్రకృ
తిగుణవిపర్యాసములన్। గాసిలకుండగబ్రోతువు। నీసరిదైవములులేరునీలగ్రీవా ॥ క ॥ తావక
మహిమావృత్తం । యేవంవిధమనిమనమున నెఱుగు నెభువిలో । నేవిద్వాంసుండైనను । నీవైభో
ధింపకున్ననీలగ్రీవా ॥ చ ॥వనజవిలోచనాదులకుపర్ణ నేయగరానియట్టిని । న్ననయముగొల్చు
మానినిచయాగ్రణియైనమృకండనందనుం । గనికరమొప్పమృత్యుభయఖండనజేసిదురాగ్రహాం
శుమ । త్తనయునిదన్నిబ్రోవవెముదంబునబుంగవరాజవాహనా ॥ క ॥ బుడుతనెలదారినేసీ ।
వడయుడదోసములగుందువాడనిడుమలన్ । బడకుండగావుమొక్కెద ।నడుగులకున్మరునిగె
ల్చియలరెడుప్రోడా ॥ చ ॥ గరగళశత్రురానణునిగావవెహేతియొసంగిదైత్యరా । ట్పురము
లగూల్పవేకలుషపూర్ణగజాసురుదేవదుర్జయుం । దురమునగూల్చితత్తనువుతూర్ణతవ్రచ్చిమ
హోగ్రచర్మమం । బరమునగప్పవేవిబుధపాలనశూలిపినాకకార్ముకా ॥ క ॥ నెనరగుచూపు
ననసునీ । వనయమురక్షింపుమెప్పుడాయాసముతెం । దనిపదమిడునేవింపం । గనుబూనిన
వాడనిత్యకల్యాణనిధీ ॥ క ॥ నీగ్గరినైనేసామత।నగ్గించెదమీరలేదయాశీలురునా । పగ్గెగొన
సాగజేయుడు । దగ్గరికృపదక్షయజ్ఞదంభవినాశా ॥ చ ॥ శిరమునలేతరేవెలుగుచెన్నగునె
న్నుదుటన్జిదగ్నికం ।ధరమునశేషహారముసదాహృదయంబునభక్తరక్షణ । త్వరయుసగంబు
మేననిజదారయుబెంపువహింపనిల్చినీ। పరమమనోనురాగమునపాలనజేతువుగాజగంబులోన్॥
క ॥ గిరిశయనాథమహేశ్వర । హరదూరీకృతమహోఘయద్రిసుతాధీ । శ్వరశివశిరీషసుమసుం ।
దరకేశానిన్నుగొల్తుదర్పకవైరీ ॥చ॥ అనయమనంతునిన్నుగపిశాకృతిజూటుశివామనోహరున్।
ఘనుహిమధామపర్ణగుతుకంబునబూజలొనర్చిలోకమం । దునరవితానముఖ్యగతిలోనటియిం
చెదవామదేవనా । మనవిమనంబునందిడిసమానులలోనగృతార్థుజేయవే ॥ క ॥ సృజనాద్యమి
త్రపావక । రజనీపతినేత్రభక్తరాణ్మిత్కారీ । వృజినమడపుమొక్కెదనీ । రజభవనుతన
న్నుబ్రోవరాకృపతోడన్ ॥ ఉ ॥ ఈవిధివిశ్వకారణునహీశ్వరభూషుద్రినేత్రుశంభునా । నా
విధసూక్తులన్బొగడినందితురంగునిసార్వభౌముభ । క్త్యావిలచిత్తుడైభృగువహర్నిశమున్ఫల
పుష్పజాతులన్ । వావిరిబూజసేయుచుధ్రువంబుగనాట్యముసల్పుచుండగాన్ ॥ క ॥ అంతట

విశ్వేశ్వరుడును । శాంతకుడాభక్తిగీతికార్చాదులతుఁ । సంతోషస్వాంతుండై । చెంతను
బొడజూపిమానిశేఖరునకనెఁ ॥ క ॥ ధాతృసుతనేనుదృష్టుడ । నైతిని నీమనము దెలియనాయె
నువిబుధ । వ్రాతహితభవదభీష్టం । బేతెఱంగో కోరుసంశయింపకుమిడెదఁ ॥ చ ॥ అనవి
మ్మ ఘాలికాడుకమ్మహానీయునకిట్లు బల్కె నో । మనసిజవైరి నేనాకకుమారునిగోరెదబుత్రు లే
ఘనే । పనియుగాఁ అంతపుణ్యగతిశాల్వడదట్టులవంశపా । వసుదయసేయుపేడెదదివాకరకోటి
ప్రభాసముజ్జ్వలా ॥ క ॥ ఏనందునకుఁదపముఁ । బూనితినినుగంటిశీఘ్రమునసుగృతార్థుం । గా
నూహింపుమనఁ శివు । డౌననిమఱలంగమానికనియెఁ గృపతోఁ ॥ క ॥ పేరునమానసవాచా ।
చారకులంబులనునీకుసరివచ్చునటుం । చారసీసురలెన్నదగుగు । మారుండుదయించుపినుముమహా
నివరేణ్యా ॥ గీ ॥ తడవులేదుసుగుణితనయుడబ్బునటంచు । వరమొసంగిమానివరునివిడచి । లిం
గమందుశివుడులీనతగాంచెద । న్మహిమమెన్నదరమెతజ్జ్ఞులకును ॥ గీ ॥ అంతగొంతకాలమరిగిన
పిదపత । త్పతిశుచిస్మితాఖ్యసరసిజాక్షి । భర్తదానుగూడివర్తిలుచుండగా । నెలదొలంగెతప
సినెలతకపుడు ॥ సీ ॥ పుండరీకాప్తతబాసగెగన్గవనుశుభ్రాంశుచందముదోచెనాననమున ।
భౌమవాసనజిహ్వపైనోష్ఠములజెందెసౌమ్యతపల్కులజతవహించె । గురువృత్తిమించెనుగుచ
ములుభృగువయ్యెగౌనుశుంఠతనడకలనుజెందె । గడుతమోగతిచూచుకములనువ్యాపించె గేతు
భావము నారుగీలుకొనియె । భావితావకపుత్రసంభవముతటిన । గ్రహములన్నియుపరమోచ్చగ
తులనుండు । మనుచభయమివ్వజనుదెంచెననగనిలిచె । జూలుచిన్నెలమిషమునసుదతిమేన ॥
క ॥ ఈరీతినుండుతనసతి । నారసిభృగుమానిమిగులహర్షించెనుగా । రీరమణుజంద్రశేఖరు ।
కారుణ్యంబుననుబ్రాప్తకాముడననుచుఁ ॥ క ॥ ఆరమణిగర్భవతిశుభ । కారణఫలగర్భభర్మ
కదళికవోలెఁ । దారాజిలెసరిసతులఁ । గారాబముభృగువుసేయగాగడువేడ్కఁ ॥ గీ ॥ అటు
లనీరుమోసియక్కాంతపండ్రెండు । నెలలునిండబుత్రునిగనెగశ్య । పసతివామనాఖ్యపట్టినిగ
న్నట్లు । భృగువుసంతసింపబిసరుహాక్షి ॥ చ । సురలుప్రసూనముల్గురియజోడుగజల్లనిగాలివీ
చెన । చ్చరగములాడెగారుడులుసంస్తవనంబులుసేయహవ్యభు । గ్వరుడుప్రదక్షిణార్చులప్రకాశ
ముతోవెలుగొందెనమ్మునీ । శ్వరసుతజన్మవేళగ్రహవారము.తినెఱుంగనేటికిఁ ॥ క ॥ పుట్టిన
బాలునిగనివిధి । సృష్టిశుచిస్మితసమాఖ్యభామయమోదం । బుట్టిపడమేనుమఱచె । పట్టికిసరిపో
లునట్టిభాగ్యముకలదే ॥ క ॥ భృగువుకుమారునకునునిం । పుగవిధివజ్జాతకర్మమునుదీర్చిశుభం ।
బగుపుణ్యాహముసలిపెను । నిగమోక్తాచారమంత్రనివహముతోడఁ ॥ చ ॥ మొదవులులక్ష
సంఖ్యలునమూల్యమణుల్ ధనరాసులుఁ సుతా । భ్యుదయమహోత్సవోదమునభూసురరాజికొ

సంగిదివ్యసం । పధలిగురింపగాచ్యవనపావననామమొసంగియంతస । మ్మదమునసోలలాడిరిసమానులలోపలనవ్వధూవరుల్ ॥ గీ ॥ బ్రాహ్మ్యసంస్కారమొందియబ్బాలకుండు । సానదీరినమణిరీతిచారురుచుల । నఖిలజనులకుసంతోషమావహిల్ల । భాసురుండయ్యెక్రమముగాభానుపగిది ॥ చ ॥ అనుచుసుహస్తనామకసహాయుడుభార్గవరాముజూచియి । ట్లనుభృగుమౌనినాయకునకాత్మజునిచ్చిసుమాద్రివాసుడై । తనయదమల్లికార్జునవిధాయకనామముబూనినిల్చెనా । మనసిజవైరిలోకములమందసుఖంబులజెందగోరుచున్ ॥ గీ ॥ భృగుమహామునితపమాచరించువేళ । శ్రీగిరిస్థితదివ్యులయోగివరుల । సాక్షిబెట్టినకతమునశర్వమూర్తి । సాక్షిమల్లేశుడనగనిచ్చటనునిలచె ॥ శా ॥ సంతానాహ్వయమల్లికార్జునుడనన్సాక్ష్యాఖ్యమల్లేశనా । మాంతర్యంబునసన్నుతుండగుచునిత్యంబిచ్చటన్నిల్చెనా । కంతుధ్వంసియురెండుమూర్తులగులింగబుల్గదానాక్కడై।సంతోషంబొనగూర్చులోకములకున్సంతానమిచ్చున్దయన్ ॥ గీ ॥ ఇట్లుగంధర్వుడనవినిహితముమీఱ ।బరశురాముడుసమ్మదభరితుడగుచు । శ్రీగిరిస్వామిపదములజేర్చెశిరము। వినుడుమునులారయనినజైమినినిజూచి ॥ వ ॥ నైమిశారణ్యవాసులటమీదివృత్తాంతంబడుగుటయు॥ శా ॥ ప్రాగ్జన్మార్జితనైజపుణ్యవిభవప్రాదుర్భవాత్మీయస । న్మార్గాలాపవినోదలాలనసుఖామోదానుగాలోకన । స్నిగ్ధాభీరకుమారికాకుచతటశ్రీలోలహస్తాంబుజా । దుగ్ధాబ్ధ్యురగరాట్సుయానవిధనద్దోషాచరాయోధనా ॥ క ॥ రంధ్రాంతరోద్ధమురళీ । మంద్రధ్వనిమాత్రగోపవనవతీసీ । రంధ్రవ్యామోహకరపు । రంధ్రీద్రుపదాత్మజాంబరప్రదశౌరీ ॥ మాలిని ॥ కనకమయదుకూలాకర్మబాధావిఘాలా । మునిచయపరిపాలాముక్తివల్ల్యాలవాలా । వినమదమరజాలావిశ్వనిర్మాణమూలా । ఘనముకురకపోలాకంధికన్యానుకూలా ॥ గద్య ॥ ఇదిశ్రీమేధాదక్షిణామూర్తివరప్రసాదలబ్ధకవితానైపథ్యవేమనారాధ్యముద్ధసంగేశ్వరపుత్రకౌండిన్యసగోత్రపవిత్రశివానుగ్రహానుషంగశ్రీకాళహస్తిలింగవిరచితంబగు పుష్పాచలఖండంబనుమహాపురాణంబునందునారదుతీర్థయాత్రయునతండమృతాశయాలోకనంబుసేసి తన్మహిమకచ్చెరువందిబ్రహ్మతోవిన్నవించుటయునద్దేవుండువిష్ణుసహితుండైకైలాంబునకరిగిశివునకువిజ్ఞాపనంబుసేయుటయుశివుండునమృతవాపినంతర్హితంబుగావించుటయును మామాహేశ్వరోపాఖ్యానంబునుసంతానమల్లికార్జునచరిత్రయుననుకథలుంగలచతుర్థాశ్వాసముసంపూర్ణము. * * *



శ్రీ ర స్తు.

# పు ష్పా చ ల ఖ ం డ ము.



## ప ం చ మా శ్వా స ము.

శ్రీరమణకర్మబంధవి । దారణయుద్ధాగ్రతఃప్రతాడితవిలస । ద్ధారాళోపనిపద్యా । గ్భేరీపుష్పాద్రిచెన్నకేశవశౌరి ॥ వ ॥ దేవాఃఇన నానందింపుమట్లు శౌనకాదిమహామునులకు జైమినిమునీంద్రుడిట్లనియె ॥ గీ ॥ అటుసుహస్తుండుబోధించినట్టిపలుకు । లాలకించిభృగూద్వహుండనియెమ అల।మనసువిశ్వేశ్వరస్వామిమహిమవినగ । నాసజెందెడిజెప్పుమహానుభావ ॥ చ ॥ అనినసుహస్తుడిట్లనియెనాభృగురామునకాదియందుకా । శినిగలవిశ్వనాథశశిశేఖరువాయుసుతుండుదెచ్చినే।ర్పుననుప్రతిష్ఠజేసెదగబుప్పగిరీశ్వరుయామ్యభాగమం । దనన అకోసుదూరమునదోషహరంబదిచూడుభార్గవా ॥ గీ ॥ అనినగంధర్వుపల్కులనాలకించి । భార్గవుండతికౌతుకభరితుడగుచు । నిచటలింగములగలమహిమముకరుణ।ననఘువేఱ్వేఱజెప్పుమటన్నతడు ॥ క ॥ వినవయ్యాభృగుకులోద్భవ । పినాకినీతటమునందుపితృపతిదెసనిం । పుననిల్పెలింగపంచక । మనఘుడగస్త్యుండుతనమహామహిమమునన్ ॥ క ॥ అవిపంచభూతలింగము । లవనిన్ జెన్నొందెమునుహిమాంశుడుశశికాం । తవిభాస్వల్లింగమునిడె । భవహరసోమేశ్వరాఖ్యభవుడితడనఘా ॥ చ ॥ కనుమిదిరోగసంహరముకశ్యపముఖ్యమునీంద్రులెప్పుడ। ర్చనలొనరింతురెల్లనుపచారములన్నుతిజేతురీశివున్ । మునునిబుతిప్రభూత్తముడుముఖ్యతబూజలొనర్చితాసుఖిం । చెనఘహరే

## ✻పాపవినాశేశ్వరచరిత్రము.✻

శుసత్కథనుజెప్పెదనాకొనుమింకభార్గవా ॥ క ॥ మునుజెప్పినసిద్ధపురం। బునగాపురముండునొక్కభూసురవర్యుం । డనఘుడుధర్మాత్ముడుశి । ష్యనివహమునకెప్పుడుజెప్పునాగమవితతుల్ ॥ ఉ ॥ ఆతడహర్నిశంబునిగమాధ్యయనంబుపదేశమిచ్చువి । ఖ్యాతిగశిష్యకోట్లనుసమర్థులజేయుచునగ్నికార్యసం । జాతవిధుల్ఘటింపగికుశల్సమిధల్గొనితేరసాంద్రవని । వ్రాతమహావనంబునకువారినిబంపగనేగిరయ్యెడన్ ॥ చ ॥ సమిధలుదర్భలారసవిశారదులాధరణీసురార్భకుల్ । క్రమమునవాటినేర్పఅచికట్టులుమూపునజేర్చిరాగద। త్సముదయమందుముఖ్యుడగుతజ్జునిశిష్యునిబట్టిమ్రింగియే । పునజనెవ్యాఘ్రమొండచటఘోరుసతోడిజనంబులార్వగన్ ॥ క ॥ అవిఘమారసినసహం। లేవాసులుగురునికడకతిత్వరజనియ । వ్వానసునకెఱుగజెపిన । నావిప్రుండార్తుడగుచునడ

లెమహాత్మా ॥ మ ॥ శివశర్మావని దేవతాతిలకమిస్సీదైవమాయెంతదు । ర్భవముఁ జేసితినారబా
లకునిశాస్త్రప్రౌఢునేబొమ్మటం । చవివేకంబునహత్యపాలయితినాహానిష్కృతిఁ దెల్పువా । రె
వరో కాననటంచుజిత్తమునసూహించెఁ విలాపించుచుఁ ॥ గీ ॥ తానుదలపోసిపుష్పాద్రిదరికిఁజే
రి । యటపినాకినిలో గ్రుంకియగముఁబొంత । గుహానువారుణమంత్రనివహములొప్ప । లింగము
నునిల్పెభూసురపుంగవుండు ॥ క ॥ అచ్చటబదిరెండేడులు । నిచ్చలుదపియించునతనినియమ
మునకుదా । మెచ్చిపొడచూపశంకరు । నిచ్చన్నుతిజేసెభక్తియిమ్మడిగాగఁ ॥ సీ ॥ దేవాది
దేవయిదేవందనముభూతనాధనీకెప్పట్లనతియొనర్తు । రవిచంద్రబర్హినేత్రానందివాహనప్రాంజ
లిజేతుగుద్రాత్మజార్ధ । గాత్రప్రణవరూపకనకభూధరచాపనిఖిలలోకవ్యాపినిర్మలాత్మ । కా
త్యాయనీమనఃకంజాతరోలంబహరపరమేశదయావలంబ । నన్నురక్షింపుమయ్యయాపన్నవరద।
వినుతిగావింతుననిమదిపేట్కమీఱ । నుగ్రమోలనుగదలకనూరకున్న । నతనిగనుగొనిపత్యా
స్మరాంతకుండు ॥ క ॥ భయమేలతపమునకునే। బ్రియమందితినీప్సితమువరింపుములోక । త్రయ
ముననేయదివేడిన । దయనిచ్చెదనన్నబలికెధరణీసురుడుఁ ॥ గీ ॥ సాంబనిర్హేతుకబ్రహ్మహ
త్యగలిగె । దానిహరియించిబ్రోవుముదంబుతోడ । ననిననట్లగుననుచుబురాంతకుండు । లీను
డయ్యెబ్రతిష్ఠితలింగమందు ॥ క ॥ అంమునపాపవినాశను । డందురుమునివర్యులిచటహరమూ
ర్తినిద । త్సంవర్ణనమునదుర్జను । లందఱుపాపములబాతురనఘచరిత్రా ॥ క ॥ ఇదిసుబ్రహ్మ
ణ్యుండిం । పొదవఁ స్థాపించెనీమహోన్నతలింగా । స్పదసుబ్రహ్మణ్యేశా । భిధుగొలువుము
భక్తిరక్తిభృగుకులతిలకా ॥ క ॥ పాతాళమల్లికార్జున । డాతడుగశ్యపుడునిల్పెయఖిలైశ్వ
ర్యో । పేతులజేయునుభక్తుల । ఖ్యాతిగభృగురామపూజగావింపుమొగిఁ ॥ గీ ॥ నలువతొల్లి
పుష్పనాథునికనతిదూ । రముననిలిపెనితడుగమలసంభ । వేశ్వరాఖ్యగొల్వుమిష్టకామ్యార్థసం।



## ※భాస్కరేశ్వరోపాఖ్యానము.※

పదలుగల్గునీకుపరశురామ ॥ చ ॥ రవిమణిలింగమిచ్చటగరంబనురక్తనిభాస్కరుండుమా। భవ
పదభక్తిశీలతయథావిధినిల్పెనుభాస్కరేశ్వరా । భవుడితనిన్భజింపనిరుపద్రవులైరుజలఁదొ
లంగమా । నవులుసమస్తసౌఖ్యముగనంగలవారలుభార్గవోత్తమా ॥ మ ॥ వినుమోభార్గవదా
మపూర్వకథనుర్వీదేవముఖ్యుండుధ । ర్మనిరూఢాత్ముడొకండుసిద్ధపురిలోరంజిల్లునాతండుదు ।
ర్వ్రణకాసార్తినిగుందిమాన్పుటకునెవ్వారింగనఁ లేకవం । తనుజెందంగనొకప్డుభూతలముగా
నన్నారదుండేగుచుఁ ॥ గీ ॥ దైవయోగంబుననుగాంచెధర్మనిరతు । విపులరోగార్తిబాధితు
విప్రకులఝు । నతడునారదుబూజించియాత్మదశను । విన్నవించిననాలించివిధిసుతుండు ॥ క ॥

పరిహారము దెలుపుటకై । దురితంబో దానివిధము దొలుత దెలిసిపిమ్మట్ । వెరవరయుట యుక్తంబని।
పరగన్ యోచించి యనియె బ్రాహ్మణుతోడన్ ॥ గీ ॥ విప్రవర్య నీవు వినుము పినాకినీ । తటినితూర్పు
దెసను దనరు పుష్ప । పర్వతమున గలదు భాస్కరేశ్వరశివుం । డతని గొల్వబోవు మఘహారంబు ॥
ఉ ॥ కానపినాకిన్మునిగి కమ్మనియెజ్జనివేయి పూవులన్ । భానుని ద్వాదశాఖ్యల శుభంబుగ నిర్వ
దినాల్గునాళ్లుద । త్పూనశరారిభక్తిమెయి జొప్పడ నర్చన జేయు రుక్తతు । ల్మానుపుచంద్రజూటు
డనుమానము మానుము విప్రపుంగవా । చ ॥ అనవిని నారదోక్తిని సుమాద్రికి నేగి నదిన్మునింగి యా।
ఘనరుణదీపితాంశుమృదుశోణసుమంబుల బూజ జేసెబా। యనినిజభక్తితోడ సమయత్రయమందున
భూమిదేవుడా । దినకరు దివ్యనామములతిప్రమదంబున నుచ్చరించుచున్ ॥ గీ ॥ భానుఖగసూర్యర
విమిత్రభాస్కరార్క । రంజితాదిత్యపూషహిరణ్యగర్భ । సవితలకును మరీచికంజలియటంచు।
ద్వాదశాఖ్యల మిహిరుసంస్తవము సేయు ॥ సీ ॥ ద్వాదశనామమంత్రంబులు జదువుచు నభిషేక
మొనరించి హల్లకముల । శోణగంధాక్షతాద్యానేకవస్తువులర్పించి తగ పాయసాన్నవార । ణఫ
లంబులు సమర్పణము జేసి తాంబ్రదక్షిణనమస్కారాదికృత్యములను । గావించి వేదాంతకలితసూ
క్తులను సంస్తవనమాసక్తిమై సలిపి యిరువ । దియును నాలుగుదినములతిప్రియమున । మూడుకాలం
బులను గొల్చి మునులు మెచ్చ । భాస్కరేశ్వరు సేవించు బ్రాహ్మణుండు ॥ క ॥ ఆవిప్రునకనుమోదం । బా
వహిలన్ భాస్కరేశ్వరాహ్వానశివుం । డావిర్భవించి కరుణా । శేవధిమైయమృతరసము జిల్కుచు బలి
కెన్ ॥ క ॥ ధరణీసుర భవదిష్టం । బరసి వరంబడుగు కాలయాపన మేలా । త్వరలో నొసంగ గృపతో ।
నరుదెంచితి నిన్ను మెచ్చి హర్షము మీఱన్ ॥ చ ॥ హరుడిటులానతిచ్చిన ధరామరు డిట్లను గామమో
హసం । కరుడనుమున్ను నేను పరకాంతల గూడి మనంబులోనద । త్స్మరణ మొకప్పుడేమరక జా
ల్ముడనై మితిలేని కల్మషా । త్కరములరోగినైతి ననుగావుము బాధలడంచి శంకరా ॥ మ ॥ అని
నైజోక్తిబువాకృతంబు దెలుపన్ ద్రయక్షుండు దెల్పెన్ స్మనం । బనురక్తిన్ దగ విష్ణుశర్మనకు నాహ్లా
దంబుగా నిర్భయం । బునవర్తిల్లుము భీతియేటికి రుజల్బోవున్మహాఘంబు జే । సిననీ తాపచర్యలంత
యనుశిక్షించుచున్ గదా మత్కృపన్ ॥ క ॥ అని భగవంతుడు శంభుడు । తనహస్తస్పర్శమ తని
తనువున సేయం । గను నూతనమదనాకృతి । గనియెన్ ధరణీసురుండు గతకల్మషుడై ॥ క ॥
సంకటములడగి విప్రుడు । శంకరు వినుతించి చనియె సదనంబునకున్ । శంకబడనేల శంభుడు।
పంకంబడ పండె దేవపటలికి నైనన్ ॥ క ॥ ఇది భాస్కరేశమహిమం । బదలించును గిల్బిషములన
నిగంధర్వ్వం । డుదయానిధి భృగురాముని । మది కాహ్లాదంబు గల్గ మఱియిట్లనియెన్ ॥ క ॥ ధ
రదుర్జ్జనంబు పరసుం । దరులగవయునఘము దొలగు త్వరనియ్యదియె । వ్వరు విని నననిఘుహాస్తుం।

డు । పరమాప్తతభార్గవునకుబల్కెనవిధముఁ ॥ వ ॥ జైమినిశౌనకాదిమహర్షులకుజెప్పి మఱి
యునిట్లనియె ॥ ఉ ॥ స్థిరలోనెవ్వడుభాస్కరేశ్వరమహాక్షేత్రాపగాస్నాతుడై । శరణోదే
వసదాశివాయనుచునిచ్చఁ శంభుబూజించిను । స్థిరతఁ దాపసవృత్తిసల్పినబరస్త్రీసంగదోషాప
హం। బరయఁ గోరినకోర్కెలఁ బడసిశైవాగారమొందుఁ దుదిఁ ॥ గీ ॥ వానివంశమువృద్ధియై
వసుధలోన । ద్రుహిణకల్పాంతపర్యంతధ్రువయశమున ।నిలుచుసౌభాగ్యసంతానములజెలంగి।
శాంభవానుగ్రహమునకుసాటిగలదె ॥ క ॥ ఈరీతిబల్కెజైమిని । కారుణ్యతమునులకనియోగం
ధర్వుండా । ధీరునకుదెల్పుగాథను । మీరలకెఱుగింతుసంయమిప్రభులారా ॥ క ॥ అంతట
సుహస్తకథితం । బంతయువినిరాముడాత్మనచ్చెరుపడుచుఁ । వింతలుమఱియుఁ దెల్పజి ।రం
తనసఖుజూచిమిగులఁబ్రార్థించుచనెఁ ॥గీ॥అఘహరమహానురాగప్రయాగమాధ।వప్రభుమహత్వ
మునువినవాంఛగలిగె । దానిమహిమంబుదెల్పుగంధర్వనాగ । నతడుబల్కెనురామునకతిము



※ప్రయాగమాధవచరిత్రము.※

దమున ॥ చ ॥ అరయఁబ్రయాగమాధవమహత్వమభీష్టములిచ్చుగాశికా । పురవరవిశ్వనాయ
కుడుపుష్పగిరీంద్రముజేరినప్పుడా । హరిసనుదెంచిస్వాంశమునవచ్చటతోడనెనిల్చెవేట్కనీ ।
సరిదుదగాశనాస్థలవిచారముదెల్పనశక్యమేరికిఁ ॥ గీ ॥ భవ్యపుష్పేశ్వరాస్థానపశ్చిమమున ।
నీపినాకినితీరంబునిందిరేశ । డధివసించుటనిదియెప్రయాగసమము । గాననీక్షేత్రమపవర్గకా
రణంబు ॥ గీ ॥ అవనియోజనసాహస్రమందునుండు । నరులపాపములడచుపినాకినియన ।
స్నానపానములొనరించుజనులసప్త। తరములుతరింపకున్నెపాతకములడగి ॥ గీ ॥ ఎవడుప్రా
ణానిలంబులనిచటవిడుచు । నాతడపవర్గమునకేగునసితపక్ష। మునచతుర్దశినదిలోనమునిగితర్ప ।
ణాదులొనరించుజనుడుకృతార్థుడగును ॥ క ॥ మునుదండధరుండిచ్చట । మునిగిగదాసర్వపా
పములబాసెనునీ । మనమునసందేహింపకు । మనఘాయీక్షేత్రమేప్రయాగముసుమ్మీ ॥ క ॥
దీనికిఁ గొంచముతూరుపు। । గానుండునురుద్రపాదకంజాతముత । త్స్థానముగయనాబరగుఁ ।
మాన్యులకావాసమదిగనఁ భృగురామా ॥ గీ ॥ అట్టిపినాకిలోఁగ్రుంకిహరునిదేవ । నాథుబరమే
శురుద్రుబినాకపాణి ।నభవుగాంచినబ్రహ్మహత్యాదికలుష। సంహరంబగుజనులకుక్షణములోన॥
క ॥ మనుసమయమధ్యమునశివ । యనురెండక్షరములెవ్వడనువాడేము । క్తినికరమునవిడుకొ
నునన । ననయముదలపోయువారికదియద్భుతమే ॥ గీ ॥ నగుచుపరిహాసించితెగబలాత్కార
తా । జ్ఞానములయదృచ్ఛకారణమున । శివయటంచుబల్కెజెట్టికైననుముక్తి । పథముదొరుకుని
జముపరశుధామా ॥ క ॥ శివయనురెండక్షరముల। భవనామముపుణ్యదంబుభవ్యాశీకారం । బవి

యించుకలుషములనీ। భువినివకారంబు మోక్షమునొసంగుదుదిక్ ॥ గీ ॥ ధరణి నెవ్వరుశివయనిత
లచిప్రాణ। ములనువిడతురువారలుకలుషులైన।నఘములదొలంగియపవర్గమందెదరన ।ననఘశ్రీ
కంఠమాహాత్మ్యమరయవశమె ॥ గీ ॥ భవ్యహరిపాదమునరుద్రపాదమందు । పిండనిర్వాపణ
ముతనపితృలదలచి। శాస్త్రగతిజేయుభూసురసత్తముండు।సప్తకులజులపుణ్యసంప్రాప్తికనుపు॥
క ॥ మనుజుండెవడైనబినా । కినితీరమునందుడిందగిల్బిషపరుడై । ననుశంకరసేవకులన్ ।
ఘనుడైయపవర్గమొందగలడుమహాత్మా ॥ గీ ॥ ఈపినాకినిజలములందెవనిశల్య।వితతులెప్పుడుజే
రునోవిమలుడగుచు। నట్టిమానవుడప్పుడెహరనివాస। మందులేనెలదాలుపైయమరురామ ॥క॥ ఇ

## *పినాకినీమాహాత్మ్యము.*

చ్చటిపినాకినీగుణ । మచ్చుపడన్ బోధజేతునాలింపుముసం । పచ్చయముగూర్చుజనముల । స
చ్చరితులజేయనిదియెచాలుమహాత్మా ॥అదియెట్లంటేని॥ సీ ॥ గంగాసరస్వతీకాళిందులైకమత్య
ప్రభావంబుననవనిలోన । లోకహితముతమలోగొనివృషభాఖ్యనగమునబుట్టిపినాకినియన । హ
రదృశ్యమానపథానుగయైమించిపాపపుంజంబులుబ్రహ్మహత్య । లదలించునిలపుణ్యవములతీర్థంబు
లనాడినవారలకంగశుద్ధి । గలుగునింతియెయిదిజగంబులనుమూటి । లొప్రసిద్ధివహించెవే
ల్పులునుతింప । నఖిలహత్యాపహాసమాఖ్యానయగుచు । ధర్మగుణసాంద్రభార్గవతాపసేంద్ర॥
గీ ॥ రామయీక్షేత్రమందుతీర్థత్రయంబు । గలపినాకినిముఖ్యమైకలువ.వితతు । లడచుమువ్వా
కలందొందనగుఫలముల । క్రమతనిడజాలుకాలభేదములవలన ॥ క ॥ ఏనరుడుమాఘమాస ।
స్నానంబొనరించునిందుసరగనతనికిన్ । తానువియద్గంగపగిది । నీనేర్చునుపుణ్యవితతినెల్లసు
ఖములన్ ॥ గీ ॥ ఎవడువైశాఖమునగ్రుంకునిందువాని । కిచటనిష్టార్థములగూర్పహేతువైన ।
యమునయగునిదియామాసమందుసకల । కర్మబద్ధులరక్షింపగలదునిజము ॥ క ॥ ఏవారుకార్తి
కికమున। ప్రావీణ్యముతోమునుగసరస్వతియైతా। శ్రీవెలయజేయువారికి। గావుననవ్వేళనిష్టకా
మ్యప్రదయా ॥ గీ ॥ ఎన్ననేమాసమునసరిత్తెద్దిముఖ్య । మద్దియామాసమందుననాచన
న్ని । నమలమహిమవహించిసంపదలొసంగు । నన్నిమాసంబులనుముఖ్యమగుచుభువిని ॥ చ ॥
కనుగొననెల్లమాసములగణ్యతగాంచుత్రివేణులందులో । ననుసురగంగతానటపినాకినియిన్నది
మూడువేళలన్ । ఘనులొకవత్సరంబుజలకంబులనాడినదేవతాత్వమున్ । గనియెదరన్ననచ్చె
రువెకామ్యదపుష్పగిరీశసత్కృపన్ ॥ గీ ॥ ఎట్టిసంప్రాప్తకల్మషులేనియిందు । గ్రుంకిననఘం
బుబాతురుశంకవలదు । కామితార్థములొనగూర్చికడనుమోక్ష । పదముజేర్చుపినాకినీభవ్యత
టినీ ॥ క ॥ సురపతితపస్వివృత్రా । సురుజంపినబ్రహ్మహత్యసోకినతావ । త్సరమిందుగ్రుంక

పాపము । పరిహారంబయ్యెగా దెపశుపతికరుణన్ ॥ క ॥ అనుగంధర్వునివచనము । వినిరా
ముండిచటగల్గువివిధములౌతీ । ర్థనిచయము లెఱుగు వేడుక । ననఘాయికనన్ని దెలుపనర్హుండ
వనినన్ ॥ క ॥ వినురామమహాప్రాజ్ఞుడ । వనినీకెఱిగింతుపాపహరతీర్థంబుల్ । గనుపట్టునిచ
టమోదం । బున గ్రుంకుమువాటివిహీనములు దెలిసితగన్ ॥ చు ॥ మునుదూర్వాసమునీంద్రుడి
చ్చటతపంబున్ సల్పిస్వాఖ్యప్రసి । ద్ధినితీర్థంబుజనింపజేసితటపృథ్విన్ లింగసంస్థాపనం । బొ
నరింపంగనుతత్తపఃఫలతధన్యుండయ్యెతత్తీర్థమీ । వనయంబాడినకల్మషాపహము రామా భార్గ
వాగ్రేసరా ॥ క ॥ నిటలాక్షుశిష్యవినుమి । చ్చటతీర్థములన్నిగలవు శమదమములుసం । ఘటి
యింపజాలునవిదు । ర్ఘటపాపములపహరించుగనుగొనుమాత్రన్ ॥ వ ॥ అవియెయ్యవియం
టేనిస్వర్గద్వారాభిధంబునువహ్నితీర్థంబునుయమ తీర్థంబునుసోమతీర్థంబునివిత్రికాలస్నానయో
గ్యంబులిదిహరిముందుతనచక్రంబునగల్పించుటంజేసి చక్రతీర్థంబనంబరగుబలిమథనకాలంబున
వామనపదసముద్భూతంబుగాననిదివిశ్వరూపతీర్థంబయ్యెనిది శ్రేష్ఠంబగుకాలతీర్థంబిదియాకా
శతీర్థంబుమహాతీర్థంబిదివార్షికంబుస్వర్ణీనంబు గౌరీతీర్థంబుప్రాజాపత్యాఖ్యంబుభృగుతీర్థంబుధ
ర్మతీర్థంబుసూర్యతీర్థంబుచంద్రతీర్థంబు నారాయణతీర్థంబువాయుతీర్థంబుజ్ఞానతీర్థంబుగుహ్యకతీ
ర్థంబువారాహతీర్థంబుబ్రహ్మతీర్థంబు రుద్రతీర్థంబు విష్ణుతీర్థంబుకాశ్యపతీర్థంబుహనూమత్తీర్థంబు
నాగస్త్యద్రౌణతీర్థంబులనఘంబులుకు మారవిఘ్నేశపాంచలింగికేంద్రభైరవతీర్థంబులివిపాపవి
మోచనంబు సేయంగలవు లెక్కకుమిక్కుటంబులై చెప్పనశక్యంబులగుతీర్థంబులనేకంబులుగలవని
గంధర్వుండు ॥క॥ కనపదికోటులుపదివే । ల్దనరెడుతీర్థములుగలనితథ్యంబుపినా । కినిలోననిల్చిన
నిబుధ । జనములుసెప్పుదురురామసద్గుణధామా ॥గీ॥ వాయువనియొనువినుమీస్రవంతిలోన ।గూడు
కొనుతీర్థములునాల్గుకోట్లటంచు । స్వర్గభూమ్యంతరిక్షస్థసకలతీర్థ । గణములిందుండుజాహ్నవి
గలయుకతన ॥ క ॥ కావుననియ్యదిసరగన్ । సేవకులకభీష్టమిడుటసిద్ధక్షేత్రం । బైవెలసెధ

## ✱పుష్పగిరివరప్రభావము.✱

రాస్థలినిది । సేవింపుముదలఁపుసిద్ధిజెందుదునీకున్ ॥ క ॥ లక్షశివలింగసంఘం । బీక్షితిధరమం
దుసంయమీంద్రసుపర్వా । ధ్యక్షులుసంస్థాపించిరి । దక్షత్వంబతిశయిల్లదమయంశములన్ ॥
క ॥ గిరిసర్వదేవతాకము । నరులందఱునిచటశివులునానాజంతూ । త్కరగుల్మభూజలతికలు ।
పరమేశ్వరమూర్తులయ్యభార్గవరామా ॥ క ॥ దీనిప్రదక్షిణమెవ్వరు । మానకసేయుదురొవా
రిమన్నించినుసం । తానంబభీష్టఫలముల । నీనేరదెపుష్పగిరియహీనగుణాఢ్యా ॥ క ॥ ఇందు
కితిహాసమొకటివివి । నందగుబ్రాహ్మణుడొకండునందనులకుగా । నింపుథరుగూర్చితపమిం । పొం

దగగోకర్ణమునమహోగ్రతజేసెన్ ॥ క ॥ పదిరెండేండ్లగుపిమ్మట । సదయుడుహరుడేగు
దెంచిసంయమివరనీ । మదిగలదియడుగుమేని । చ్చెదదపమికజాలుజాగుసేయకుమనినన్ ॥
క ॥ తనయుగుణవంతుగులవ । ర్ధనునిమ్మనివిప్రుడడుగదర్పకహరుడి । ట్లనుశ్రీగిరివండధరా ।
శనుబుష్పాచలముగలదుజనుమందులకున్ ॥ చ ॥ ధరణిసురేంద్రవేల్పులకుతావలమగ్గిరిసర్వశో
భనో । త్కరమగుదానియందుకుతుకంబునశుద్ధతరుద్రసూక్తమున్ । సరగపఠించిభక్తికొన
సాగగనగ్గిరిచుట్టిరమ్మునీ । త్వరతసుతుండుగల్గునధ్రువంబనిశంభుడదృశ్యుడైచనెన్ ॥ క ॥ మౌను
నానతివినివిప్రుం । డరుదెంచిలతాంతగిరికినారీతినెశం । కరసూక్తముపఠియింపుచు । ధరము
నకునుచుట్టుదిరిగితనయునివడసెన్ ॥ క ॥ ఏకోరికెతోనెవ్వా । రికుధరముచుట్టిచనుదురిష్టార్థం
బుల్ । సేకూరువారికిటనటు । నాకులతదోలంగిసుఖములందుదురనఘా ॥ క ॥ కానభవదాఖ్య
నిచ్చట । స్థాణునినిల్పుకొనితపముసల్పుచుగిరిసే । ప్రాణులుకనబడిననుదు । ర్గానాధాకృతు
లుగాగగణుతింపుమొగిన్ ॥ చ ॥ అనుచుసుహస్తుడాడినభృగన్వయసంభవుడంతసంతసం ।
బునవినిభక్తిమీఱగనుబుష్పగిరీశునిబూజజేసెతా । ననయమునాల్గునిర్వదియహంబులుబిల్వతిలాక్ష ।
తంబులన్ । వినుతసుగంధకంజకరవీరకహాటకసూనపఙ్క్తులన్ ॥ గీ ॥ అటులవేదోక్తశివస
మాహ్వయములనుచు । దండమర్పించితత్ప్రసాదంబుగాంచి । తనదుపేరిటతీర్థకల్పనమొనర్చి ।
తీరమందునలింగప్రతిష్ఠజేసె ॥ గీ ॥ భువినసంఖ్యార్కనిజకాంతిపూర్ణలోకు । నిర్గుణునిరంజను
నిభర్గునీలకంఠు । శూలినినుతించిభర్మప్రసూనశతస । హస్రములబూజజేసెభృగన్వయుండు ॥ వ ॥

## ※పరశురాముండు పరమమునుల సందర్శించుట.※

అన్నిమినిశౌనకాదులకుబోధించిమఱియునిట్లనియె ॥ ఉ ॥ అంతటజామదగ్న్యుడుసుహస్తునిగూ
డిపినాకిసీసరి । త్ప్రాంతముజేరికాంచెనుతపంబొనరింపుచుశోకల్లోకశ్లాధి । సంతులుబల్కరిం
చకనమఃపరమేశ్వరసాంబయంచున । త్యంతహితోక్తులుస్వస్తిసత్యయనంబొనరించుమౌను
లన్ ॥ సీ ॥ కొందఱుజటిలులైకూర్చుండువారునుమాసద్విమాసోపవాసకులును । పత్రతో
యాశనపరులుకొందఱుతలక్రిందుగాగ్రేలాడుకొందఱంబు । వులనుండిసూర్యరోచులులలాటం
బంటదృష్టినిల్పినమునిదేశికులును । వహ్నిపంచకమధ్యవాసులైకొందఱుమహాసియులగువారిమ
హితభక్తి । మీఱరాముడుగన్గొనిమృదుపదముల । వంశగోత్రములనుజెప్పివందనములు । జేసి
యిట్లనుమీరలుసిద్ధులధిక । హితమనోభీష్టదులుసంయమీంద్రులార ॥ క ॥ నిరతాధ్యయనరతు
లుగ్ర । స్మారహాస్యప్రియులుగానమావిన్నపమా । దరణముతోడనినిశ్చల । కరుణామతిఁనుడి
మౌనిగణపాలారా ॥ గ ॥ హత్యవలనదోసమంటినసేనాడు । త్రితమడంపనాకుక్రనతముబూని ।

యేగుదెంచినాడనిచ్చటికేటుగుడీ । తత్ఫలదులుమీరుతజ్ఞలార ॥ క ॥ మునిభార్గవజమదగ్నికి। తనయుడరాముడనువాడతావకకరుణా । వనమునకుపాత్రుడనున । న్ననయముర క్షణము జేయ నర్హులుమీరల్ ॥ క ॥ మిముదీనదయాపరులఁ । సమవృత్తిప్రియులవినుతిసల్పెదతప్పుల్ । క్ష మియించిననుభయాతురు । శ్రమలడచిపవిత్రునిగ బ్రసాదింపుడొగిఁ ॥ గీ ॥ అభయదానంబు నకుసమయంబుగాన । నన్నుజేపట్టిమున్నెనానర్చినట్టి । హత్యలనుమాన్పగామీరలాత్మనెంచి । యనఘుగావింపరయ్యపుణ్యాత్ములార ॥ చ ॥ అనిపలుకఁభృగూద్వహుఁగృతాఘునిగామది లోనెఱింగియ । మ్మునులుదయాపరుల్పరమపుణ్యులురామునిజూచికూర్మితో । ననిరిగుణాఢ్య మామకహితాలపనంబులుసావధానతఁ । వినుమికమమ్మునీవడుగునిష్కృతిదెల్పెదమాదరంబు నఁ ॥ గీ ॥ నీమనోభీష్టమీడేరునీవ్రతంబు । సముచితంబుగనేమందఅముసహాయ । పరులమ గుదుమమామకభాషణంబ । మోఘమిద్ధరపుణ్యతముండవగుము ॥ క ॥ పుష్పేశ్వరప్రసాద ము । నిష్పాపులజేయజాలునీదగుహత్యా । దుష్పథమనెంతటిపని । నిష్ప్రత్యూహములుగావె నీకోర్కులిలఁ ॥ క ॥ వ్రతమాచరించిపిమ్మట । వితతాధ్వరశీలులైనవిప్రోత్తమసం । తతులకు యథానుకాలము । సతతముదానములొసంగుశాంతాత్ముడవై ॥ క ॥ స్నానమనోనిగ్రహములు। దానస్తోత్రార్చనలునుతపమునవిశ్వా । సానూనవ్రతభక్తివి । ధానంబులనీకుపాపతతిసమయు జుమీ ॥ గీ ॥ విధియుతంబుగమంత్రాగ్నివ్రేల్చుమీవు । కార్యసంసిద్ధిహరుకృపగల్గుననిన । నా త్మహర్షించిపులకితాత్మాంగుడగుచు । బరశురాముండుబుధులకుబ్రణతుడయ్యె ॥ ఇట్లుప్రణతుం



## పరశురాముండు జన్నంబొనర్చుట.

డై ॥ గీ ॥ అటులగావింతుమునులారయనుచుదాను । కొంతజింతించినిశ్చితస్వాంతుడగుచు । పరశురాముడుగంభీరభాషణముల । పలికెనుసుహస్తగంధర్వపతినిజూచి.॥ చ ॥ అరయపినా కినీతటమునందొనరింపుముపర్ణశాలచ । త్వరముగదీర్ఘశాలలయథావిధికల్పితవేదికామనో । హరతరసప్తకక్ష్యములద్వారగవాక్షమహాసనాధికా। వరణములఁజెలంగమునివారిజలోచనలుం డునట్లుగఁ ॥ గీ ॥ అనినముదమందిగంధర్వుడమ్మహాత్ము । నాజ్ఞగైకొనివిధిరీతిననుపమాన । పర్ణశాలానివేశమేర్పఱచిసర్వ । కార్యములనాయితముజేయకలితభక్తి ॥ గీ ॥ అందుమానీం ద్రసాధ్వీసహస్రములను । నిలిపిభార్గవరాముడునిఖిలతాప । సాజ్ఞతలనూనుకొనితనహస్త ముంచు । పరుసముండుటగల్పించెబహుధనంబు ॥ క ॥ పరిచారకులగుచునువ । చ్చిరిగంధర్వు లుసుహస్తుచేప్రేరితులై । సురపతిపురినుండిమహ । త్తరముగసంఘంబులగుచుతాపసులారా॥ గీ ॥ ఇటులసర్వంబుసమకూర్చిభృగువరుండు । స్నానమొనరించిహోమాసనంబుసలిపితపము । వె

లయనెనుబదియెనుబదివేలనాల । బ్రాహ్మణోత్తములకునిచ్చెరాముడెలమి ॥ క ॥ కనకాభర
ణాంశుకములు ।ధనధాన్యములఖిలరత్నతతులాదిగన ।మ్మునులకుదానములిచ్చుచు ।ననుదినమును
శక్తికొలదినన్నంబొసగుచు ॥ గీ ॥ భక్ష్యభోజ్యాజ్యలతృప్తిబరతురాము । డెవ్వడెవ్వరికెద్దియ
భీష్టమట్లు । దధిరసాయనసూపముల్దగనొసంగి । దానుజలపర్ణవాయువుల్దగగ్రహించు ॥ క ॥
మునిరమణీపచితములగు । ఘనతరమృష్టాన్నములసుఖప్రదముగస । న్మునులను నైష్ఠికులనుత । ద్వ
నితలదనియంగ జేసెవ్రతహితమతియై ॥ గీ ॥ విప్రభిక్షుకమునిజనవితతులకును । దినముపంద్రెం
డువేలకతిప్రయత్న । మునను భోజనములిడుచునయమిట్లు । ప్రాతరాహ్నికమాదిగాభార్గ
వుండు ॥ క ॥ నారదుడుజెప్పరీతిని । ధారుణిదివిజులకునిత్యదానంబులువే । సారకనొసంగి
ముదమున । నారాముడుదీక్షనుండెయమివరులారా ॥ గీ ॥ ముంచుపుష్పేశ్వరునకును మ్రొక్కి-
పిదప । నతులుగావించిశ్రీవైద్యనాథభైర । వులకుబూజలొనర్చిభక్తిలతొబెలుగ । నంతపుష్పే
శ్వరాలయమందుజేరి ॥ గీ ॥ మదినిశతవారములురుద్రమంత్రసూక్తి । జపముగావించినదినిమ
జ్జనమొనర్చి । శివునిపూజించినైష్ఠికశ్రేష్ఠులైన । మునులతోగూడసంకల్పములనొనర్చి ॥ క ॥
ఘృతపాయసేధ్మములమని । తతులగ్నినవేల్వనందుతావేల్చుమహా । ద్రవ్యతిగోవులుదక్షిణలా ।
ధ్వ్యతమానులకిచ్చునన్వహముసద్భక్తిన్ ॥ ఉ ॥ శేలజలంబులోపలనుగ్రీవముబంటిమునింగితాను
షః । కాలముమట్టుకున్గరళకంతుబరాత్పరునాత్మవేయుచం । చాలసతించుభార్గవుడధర్వణ
మంత్రములుచ్చరించుచున్ । కాలపగణ్యమైయిటుచనన్మదినెంచుదినంబొకండుగన్ ॥ క ॥ ఈ
రీతితపశ్చర్యను । దారుడుభార్గవుడుసల్పిధన్యుండగుచున్ । పౌరాణపుణ్యకథలను । ధీరమునీ
శ్వరులుజెప్పదెలియుచునుండెన్ ॥ క ॥ వివిధపురాణార్థములన్ । శ్రవణంబొనరించుదీర్ఘస
మయంబాభా । ర్గవునకుమహూర్తమయ్యెను । సువితతమైకార్యసిద్ధిజొప్పడెనంతన్ ॥ గీ ॥
వీరభద్రగజాననభైరవులును। మువ్వురుమునివేషములుదాల్చిముందునిలచి ।తతనిపైకూర్మితోడస
హాయమూని । లౌక్యవైదికవిధులబాలనముజేయ ॥ గీ ॥ వ్రతముదృఢచిత్తమునసల్పునతనికర్థి।
పంచభూతంబులేతెంచిబహువిధముల । నెచ్చమెచ్చటగలపనులేర్పరించి । తగుసహాయంబుజే
సెసంతసముమీఱ ॥చ॥ కెలకులమానిమండలికిగేలుమొగిడ్చిపినాకినీనదీ। జలములమూడుమాఱ్లుత
గజల్కనులాడుచుభక్తిమీఱగా । నలరులబిల్వపత్రములనాహరునిత్యముబూజజేయుచున్। సల
లితగీతవాద్యములుసల్పుచుశంకరుమ్రోలవేడుకన్ ॥ క ॥ ఈతెఱగునభక్తిమెయిన్ । శీలాం
ఛ రీటుగొల్చిచెలువొప్పమహా । పాతకములడచిసఖులో । జ్యోతికరిగమునులుమెచ్చిచూపు
టయువునన్ ॥ క ॥ ధారుణిశ్రీగిరియామ్య । ద్వారంబనుజ్యోతినగరమందలిపురసం । హారుని

జ్యోతీశ్వరశివు । నారాధన జేసిరాముడనుమోదమునన్ ॥సీ॥ కటిబద్ధపటుమనోత్కటకృత్తిప టుసిద్ధవటనిటలాలాక్షునికటకమరసి।రక్తితోడుతనత్తిరాలకేతెప్పరుజత్తపద్ధినిబూజసేసిసోమ। శిలమహాసంస్థాననిలయుసోమేశ్వరునర్చించిబిల్వపుష్పావలిచ్చి।హాటకగర్భముఖామరసన్నుతుకో టితీర్థేశ్వరుఁగొలిచిభక్తి।ఘనపినాకినిజలములగడిగితనువు।తాపసవిహారయోగ్యమైతనరుమత్స్య। పర్వతముగాంచిముదమందిభార్గవుండు ॥ క ॥ మునినిలయకుధరముపినా ।కినితీరంబిచటశూలి కిన్ బ్రియమగునం । చనిసంగమలింగస్థా । పనమునుగావించిముందుపథమునజనుచున్ ॥ సీ ॥ శ్రీకాళహస్తిపురీశర్వుశేషాద్రిపతివేంకటేశ్వరుబరఁగంచి।యేకామ్రనామమహేశ్వరుకరిగిరివ రదరాజాహ్వయవనజనేత్రు। మాయూరుణాచలమధురాచిదంబర శ్రీరంగచియ్యాళిసేత్వనంత।శ యనగోకర్ణాదిశాంభవవైష్ణవస్థలదేవతలగాంచికలితభక్తి । బూజలొనరించినిత్యసంపూర్ణమై త్రి । నలరుసాహాయ్యుడగుసుహస్తాఖ్యుగూడి । మగుడిజమదగ్నిపుణ్యాశ్రమంబుజేరి । జనకు నకుమ్రొక్కెభృగువంశసంభవుండు ॥ క ॥ వచ్చినసుతుగనిజనకుం । డెచ్చుపెరిమెఁగౌగిలించి వృజినంబడఁగెన్ । మెచ్చితిజిరజీవుడవై । సచ్చారిత్రమునదపముసల్పుమువత్సా ॥ చ ॥ అన చినిజామదగ్నిముదమందిమహేంద్రనగేంద్రమందుత । జ్జనకునిపంపునన్దపముసల్పుచునుండిసు ఖించెనాత్మలో । వనజదళాక్షుదివ్యపదవారిజముల్నెలకొల్పిరక్తిస । జ్జనములుమెచ్చగావిపుల సాధుగుణంబుపటిష్ఠమైతగన్ ॥ ఉ ॥ మానవులెవ్వరేనిబహుమానములోడుతనీసుమాచలా । ఖ్యానమువిన్నవ్రాసినదదర్థముజెప్పినభోగభాగ్యసం । తానములబ్బునంచుగడునర్మిలిదెల్పెనుజై మినీంద్రుడా । మానులకవ్విధంబమృతమార్గమటంచుదలంచివేడుకన్ ॥ చ ॥ నరులకునిట్టికా వ్యమిదిన్యాయముగాదనినామనంబులో । నరసిభవత్పదాబ్జములకర్పణజేసితిమీరుసత్కృపన్ । నరులకునిందునందఖిలనంద్యసుఖంబులొసంగప్రోవవే । హరిపరమాత్మమాధవసుమాచలసుస్థిత చెన్నకేశవా ॥ సగర్భకందగీతచంపకమాల ॥ హరిపరమేశ్వరాశుభవహాస్మరణప్రియసూరి పూజ్యశం । కరవినుతారమారమణకాంచనచేలవరాహమూర్తిసా । దరదరికేశవాఖరగదాధ రదుర్మదకంసనాశత । త్పరహృదయాశమామహితపాండునరేంద్రకుమారపోషణా ॥ గర్భిత కందము ॥ పరమేశ్వరాశుభవహా । స్మరణప్రియసూరిపూజ్యశంకరవినుతా । దరికేశవాఖర గదా । ధరదుర్మదకంసనాశతత్పరహృదయా ॥ గర్భితగీతము ॥ శుభవహాస్మరణప్రియసూరిపూ జ్య । రమణకాంచనచేలవరాహమూర్తి । ఖరగదాధరదుర్మదకంసనాశ । మహితపాండున రేంద్రకుమారపోష ॥పుష్పమాలికాబంధము ॥చ॥ శ్రితహితచేతనాదరిధరిత్రిరిపుస్థిరవైరపారగా భృతశతకాతరాపవిపవిత్రవిశేషయశోయశ్రీయతి । ప్రతితతినీతిదాపరమరమ్యరమాగృహాశ్రీశా

రీహారీం । వ్రతనుతతాతనుస్వనఘనస్వనయాకృశవంశకేశవా ॥ మంగళమహాశ్రీవృత్తము ॥ సూనశరకోటిశతసుందరసితాభబిససూననిభలోచనమదోద్య । ద్దానవవితానతృణదావశిఖిభర్మపరిధానధృతిమందరగిరీంద్రా । దీనజనపాలనవిధిప్రముఖపూజితసుధీనిచయశోభనవహాస । స్మానిజనమానసనమస్కృతపదాంబుజరమాసహితమంగళమహాశ్రీ ॥ ఇదిశ్రీమేధామూర్తివరప్రసాదలబ్ధకవితానైపథ్యవేమనారాధ్యముగ్గసంగేశ్వరపుత్రకౌండిన్యసగోత్రపవిత్రశివానుగ్రహానుషంగశ్రీకాళహస్తిలింగవిరచితంబగుపుష్పాచలఖండంబునందు సుహాస్తుండుబరశురామునకుబుష్పాచలక్షేత్రంబునంగలశివలింగంబులమహిమవేర్వేఱవివరించుటయు శివశర్మచరిత్రంబునుభాస్కరేశ్వరమాహాత్మ్యంబులనుప్రయాగమాధవచరిత్రంబునుపినాకినీతీర్థమాహాత్మ్యంబునుపుష్పగిరివరప్రభావంబునుభార్గవరాముండుపరమునులసందర్శించితదాజ్ఞనుపినాకినీతీరంబునయజ్ఞంబునేసీపాపవిముక్తుండగుటయుననుకథలుంగలపంచమాశ్వాసముసంపూర్ణము. ✻ ✻

పుష్పాచలఖండము.

సంపూర్ణము.



